ప్రజావిప్లవం మరోఅడుగు ముందుకువేసింది.

—జ్వాలాముఖి

బంగ్లాదేశ్‌లో మేధావుల్నీ, విప్లవకారుల్నీ పాక్‌నియంత యాహ్యాఖాన్ ఊచకోత కోయిస్తున్నాడు. ఈ దేశంలోఉన్న జాలి గుండెగల పాలకులు పాపం బాధపడుతూనేఉన్నారు. ఏంచేస్తున్నారు-? ఏంచేస్తున్నారంటే, ప్రజలపక్షం వహించి, కర్తవ్యాన్ని గుర్తింపుకు తెచ్చే పుస్తకాల్ని నిషేధిస్తున్నారు. రచయితల్ని అరెస్ట్‌చేసి జైళ్ళలో కుక్కుతున్నారు.

—కిషన్

ఏవేవో అనుమానాలపై అందరివెంటబడి ప్రజాజీవితాన్ని కల్లోలపరిచేకంటే ఏది "నగ్జలిజ"మో ఏదికాదో స్పష్టంగా ప్రభుత్వం ఒక ప్రకటనైనాచేస్తే అనుసరించాలో తప్పుకోవాలో నిర్ణయించుకోవటానికి సులభంగావుంటుంది. దాంతో ప్రభుత్వానికి శ్రమ తగ్గుతుంది; ప్రజలకు ఊపిరాడుతుంది.

—డాక్టర్ ఎం. వి. రమణారెడ్డి




ఆధునిక సాహిత్య వేదిక

నిర్వహణ: 'సాహితీ మిత్రులు' వెల: ఒక రూపాయి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

**24**

మాసపత్రిక

సెప్టెంబర్ 1971

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా: పదిరూపాయలు విడిప్రతి: ఒకరూపాయి

**SṚJANA** is commended for use in Public Libraries in the state by the Director of Public Libraries, Andhra Pradesh, Hyderabad, wide Re. No. 182/A4/67, Date 22-9-1967.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

సెప్టెంబర్ 1971 మాసపత్రిక 24



ప్రతులకు
4/729, కుమార్‌పల్లి,
హనుమకొండ, వరంగల్-1. (ఆం.ప్ర.)

## 'ప్రజా విప్లవం మరో అడుగు ముందుకు వేసింది'

పోలీసు ప్రభుత్వం విప్లవరచయితలను అరెస్ట్ చేస్తున్నది. విప్లవ కవితా సంకలనాలను నిషేధిస్తున్నది. భూస్వామ్య పెట్టుబడిదారీ స్వభావం గల ప్రభుత్వం నూతన ప్రజాస్వామ్యాన్నీ, శ్రామిక శ్రేయోరాజ్యాన్నికోరే ఎవరైనా సహించకపోవడం సహజమే.

మొన్న మార్చ్, నిన్న ఝంఝ కవితాసంకలనాలను నిషేధించారు. రాజద్రోహ నేరంమోపి కిషన్‌రావును ఏ కారణాలుచెప్పకుండానే ఏ కోర్టుకు అప్పగించకుండానే డాక్టర్ ఎం. వి. రమణారెడ్డిని దేశభద్రతా చట్టంకింద జ్వాల, నిఖిల్, చెరలను చెరబట్టారు.

ఈ చర్యలన్నీ విప్లవాన్ని విరిచేయగలగడమట్లావుంచి కనీసం ప్రస్తుత అధికారం గద్దెకిందికి మంటలురాకుండా వాయిదా వేయగలవా - అనే వివేకం కూడ లేకుండా గంగవెర్రిలెత్తిపోతున్న వీళ్ళు, విప్లవం హింసకు ప్రతి క్రియగా తలఎత్తే ప్రతిహింస అనే శాస్త్రీయ వివేచనలేనివాళ్ళు.

వాళ్ళకు చెప్పాల్సిందేమీలేదు- అధికార మదాంధకారంలో పిచ్చెక్కి స్తంభాన్నితన్నినా అందులోంచీ విప్లవ నరసింహావతారమే ప్రభవిస్తుందని ప్రహ్లాదంగా గుండెలు పొంగించి గొంతెత్తి పాడడం వినా వాళ్ళకిప్పుడు చెప్పాల్సింది ఏమీలేదు.

రచయితల అరెస్టు, పుస్తకాల నిషేధాలు యీ ప్రభుత్వం దివాళాకోరు తనాన్ని, పిరికితనాన్నిమాత్రమే బట్టబయలుచేస్తాయి. ఈ ప్రభుత్వం మేకపోతు గాంభీర్యాన్ని, కుహనాసోషలిజాన్ని, తాము నిషేధింపబడి, తాము అరెస్టయి నిరూపించిన రచయితలు ఈ దేశంలో స్వతంత్రంగా ఆలోచించే వారు, రాసేవారు, జీవించేవారు గర్వించే పనిచేసారు.

మూర్ఖత్వానికి, దోపిడీకి, ఆలోచనా తిరుగుబాటూ ప్రమాదకరమైన శత్రువులు. పోలీసు బుద్ధికి, కర్రపెత్తనానికి స్వేచ్ఛ, వర్గచైతన్యం గంగ వెర్రులెత్తించే శత్రువులు.

మేధావి అయినవాడు ఏం ఆలోచించాలి, రచయిత అయినవాడు ఏం రాయాలి- అని నిర్ణయించే, నిర్దేశించే అధికారం పోలీసుశాఖ ఎంతచల్లగా తన చేతుల్లోకి తీసుకున్నదో కొంచెం కళ్ళుతెరచిచూడమనిమాత్రం 'స్వేచ్ఛాప్రియులయిన' పౌరులను హెచ్చరిస్తున్నాం.

విప్లవ రచయితలమీద విశ్వాసంపెట్టుకున్న ప్రజలుమాత్రం 'ప్రజా విప్లవం మరోఅడుగుముందుకు వేసింద'ని చరిత్ర సత్యాలను మననంచేసుకొని మరింత చైతన్యంగా పోరాడుతారు.

—సంపాదకుడు

గెస్ట్ ఎడిటోరియల్ :

# జ్వాలారమణ రాజేశ్వరులు

(ఆనాడు విరటుడి గోవుల్ని మరొకరెవరో కాపాడేరు. కాని, ఎవరి రచయితల్నిమాత్రం వాళ్ళే కాపాడుకోవాలి. ఆ సంగతి మనవాళ్ళకి తెలియదు కాని వాళ్ళకి మాత్రం బాగాతెలుసు. అందుచేతనే, వాళ్ళ రచయితలకి వాళ్ళు లక్షలిచ్చుకుంటారు; మన రచయితల్ని మాత్రం జెయిలు శిక్షలనుభవించ మంటారు.)

ఇతరదేశాల్లో ఏంచేస్తారో తెలియదు; కాని, మనదేశంలో మాత్రం గోవుల్తోపాటు పాముల్నికూడా పూజిస్తారు. వాటికీ వీటికీ ఓ ముఖ్యమైనతేడా వుంది. వాటిని పూజించినా పూజించకపోయినా గోవులు పాలు ఇస్తాయి; పూజించినా పూజించకపోయినా పాములు కాటువేస్తాయి.

మనల్ని ప్రస్తుతం పాములే పరిపాలిస్తున్నాయని నేను తప్పక తెలుసుకున్నాను కాబట్టే స్పష్టంగా చెప్పగలుగుతున్నాను. అయితే— తెలుసుకోవడం వేరు, చెప్పగలగడం వేరు. తెలిసినప్పటికీ కొందరు చెప్పరు. వాళ్లుదొంగలు. తెలిసినప్పటికీ కొందరుచెప్పజాలరు. వాళ్ళు పిల్లిముందు ఎలుకలు, పాముందు కప్పలు. జ్వాలారమణ రాజేశ్వరులు ఈ కోవలకి చెందినవాళ్ళు కారు.

గోవులకీ జ్వాలారమణ రాజేశ్వరులకీ పోలికలున్నాయి.

భగవంతుడు గోవులకి కొమ్ములిచ్చినట్టే రచయితలకి కలాలిచ్చేడు. పాలేకాకుండా పచ్చినెత్తురుకూడా పిండేసే రాక్షసులమీదికి ఆవు తనకొమ్ము విసిరితే, తాచుల్లాంటివాళ్ళు తప్ప మరెవరూ తప్పుపట్టరు. అదే పరిస్థితుల్లో నిజమైన నిజాయితీగల రచయితలు తమకలాల్ని సూది శూలాల్లా, వాడికత్తుల్లా బలంగా విసురుతారు. ఆవు కొమ్ము విసిరితే ఆక్షేపించేవాళ్లే అప్పుడు ఆరచయితల్ని జెయిళ్ళకి నెడతారు.

అయితే— నువ్వు నాలుగ్గోవుల్ని కొట్టగలవు. నలుగురు రచయితల్ని నెట్టగలవు. కాకపోతే ఓ వందమందిని, ఓ వెయ్యిమందిని, లేపోతే, ఇంకా చాలామందిని. కాని, నువ్వేం చేసినప్పటికీ ఎంత చేసినప్పటికీ, నీకోట గోడల్నీ, నీ ధ్వజ స్తంభాలనీ ఎంతోకాలం కాయలేవు. ఆ గోడలు కూలకా పోవు. ఆ స్తంభాలు పగలకా తప్పవు.

ఆరంభం అయినది ఆఖరవక తప్పదంటారు. ఎవరో ఎక్కడో ఏహింసో ఆరంభించేరని నువ్వెంత సాకుచెప్పినప్పటికీ, ఈ గోవుల్ని మాత్రం జెయిలు హింసలకి నువ్వేనెట్టేవన్నది మా అందరికీ చాలా స్పష్టమయింది. హింస నీదయినప్పుడు ప్రతిహింస వుండక తప్పదని నీకు తెలిసేవుంటుంది. అందుచేత— నువ్వారంభించిన హింస నీహింసతోనే ఆఖరవాలి తప్ప మరోలా అవదని అందరికీ ఎంతో స్పష్టమయింది.

మరేం భయంలేదు.

జ్వాలారమణ రాజేశ్వరులు, కృష్ణాష్టమికి కొంచెం ముందుగానే, ఎక్కడైతే ఉదయించాలో అక్కడే ఉదయించేరు.

—రాచకొండ విశ్వనాథశాస్త్రి

చరిత్ర తీర్పు :

# తొలి విజయం

1971 ఆగస్టు రెండోతేదీ చరిత్రలో తలెత్తుకు నిలబడేతేదీ.

అవాళే- దిగంబరకవులు- ప్రజాకవులు- విప్లవకవులూ అయిన చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లను అరెస్టుచేసి యీ ప్రభుత్వం తనెంత పిరికిపందో యీ ప్రపంచానికి చాటింది.

ఈ ప్రభుత్వంలోని డొల్లను, ఉలికిపాటును, పిరికితనాన్ని తాము అరెస్టు కావడంద్వారా యీ కవులు బట్టబయలుచేశారు.

ఆధునిక తెలుగు కవితకిది తొలివిజయం. ప్రజలంటే ఎలక్షన్ల ముడిపదార్థమనీ, కొనబడడానికి సిద్ధంగావుండే సరుకనీ అనుకుంటుందీ శోషలిస్టు ప్రభుత్వం. ప్రజాకవుల్ని అరెస్టు చెయ్యడం ద్వారా, వారి పుస్తకాల్ని నిషేధించడంద్వారా, వారి ఉద్యోగాల్ని ఊడబెరకడంద్వారా, వారి రచనలు ప్రచురించే కొన్ని పత్రికల్ని ఆపడం ద్వారా విప్లవాల్ని చంపగలమనుకుంటున్నదీ దుర్మార్గ ప్రభుత్వం.

ఇది కుళ్లిపోయిన ప్రభుత్వాల పుచ్చిపోయిన ఆలోచన. విప్లవాలు ఏ దేశంనుండో దిగుమతయ్యేవికాదు; ఏ యితరభాషల సిద్ధాంత గ్రంథాలనుండో అనువదింపబడేవికాదు. ఇక్కడి ప్రభుత్వాల ప్రజావ్యతిరేక చర్యలపై, ఇక్కడి ప్రభుత్వాల అవినీతిపై, మోసాలపై, దౌర్జన్యాలపై, పేదవాణ్ణి మరింత పేదవాణ్ణిచేసి, సాంఘిక విలువల్నిడబ్బువిలువలుగా అధికారంవిలువలుగా, అక్రమసంపాదనపై కులికేవిలువలుగా చేసేవిధానాలపై యిక్కడి ప్రజాజీవితంనుండి, ఇక్కడి సమస్యలనుండి, ఇక్కడి యువకగుండెల్లోనుండే విప్లవాలు ఆవిర్భవిస్తాయి.

నూటయాభయ్యోసారి రామాయణాలు రాయించి లక్షలరూపాయిలు బహుమతులనివ్వడంద్వారా, తమకాకారాయుళ్లని కవులుగా చలామణీచేయించి అగాధామీలని నింపడంద్వారా విప్లవకవిత, చచ్చిపోతుందనుకోవడం భ్రమ. ముట్టు (వార. మాస) పత్రికల్ని, ముదనష్టపు హంగుల సినిమాల్ని, రేసుల్ని, లాటరీల్ని, సారాదుకాణాల్ని, వ్యభిచార గృహాల్ని ప్రజలపై వుసిగొల్పి, ప్రజల్ని శాశ్వతంగా పక్కదారి పట్టించగలమనుకోడం వెర్రి.

విప్లవాలు సాయుధంగారావాలా, నిరాయుధంగారావాలా అనే ప్రశ్నలకే తావులేకుండా అందుబాటులోనున్న ఆయుధాల్తో, అవసరమైన ఆలోచనల్తో, సృజనాత్మకమైన వ్యూహంతో ప్రజలు ఎక్కడున్నవారక్కడినుండే విప్లవాలూ రహస్యంగా గాక

బాహాటంగా నడుపుతారు, అతి త్వరితంగా దేశంలో విప్లవనాయకత్వం స్థిరపడుతుంది, యువకులే దీనికి సారధ్యంవహిస్తారు. పొలాలూ, విశ్వవిద్యాలయాలూ, ఆఫీసులూ, యావత్ పౌరజీవన వ్యవహార ప్రాంగణాలన్నింటినీ ఆక్రమిస్తారు, ఈ కాన్సర్ ప్రభుత్వం ఒక పుస్తకం. ఒక పత్రికను నిషేధిస్తే వేలకొలది పత్రికలూ, పుస్తకాలూ విప్లవసాహిత్యంతో వెలువడతాయి. ముగ్గురు, నలుగురు ప్రజాకవుల గొంతులునొక్కడానికి ప్రయత్నిస్తే వందలకొలది కంఠాలు ప్రజల్లోంచి భగ్గున లేస్తాయి,

ప్రజలు తమదైన యీ భూమి భూమినంతా ఆక్రమించుకుంటారు; తమదైన ఈ బ్యాంకుల్లోని డబ్బు తాము తీసుకుంటారు; తమ శ్రమ శక్తితో నడుస్తున్న యీ ఫ్యాక్టరీల్ని, కంపెనీల్ని తామే నడుపుకుంటారు, ప్రజలే ఉత్పత్తిని, పంపకాన్ని సక్రమంగా చేసుకుంటారు. ఈ కార్యక్రమం సాగుతున్నప్పుడు అడ్డువొచ్చే యీ ప్రభుత్వాల పోలీసులు, అధికారులు, కొమ్ముకాచే ప్రతి కిరాయివ్యక్తీ బాహాటంగా నరకబడతాడు. ఈ ప్రభుత్వం, ఈవ్యవస్థ అన్నిరంగాలలోనూ నెలకొల్పిన ఈ తప్పుడు ప్రమాణాలూ, యీ ప్రజావ్యతిరేక, సంస్కృతి, సంప్రదాయాలూ. ఈ దేవుడూ దెయ్యం, యీ దొంగ వ్యాపారాలూ బాహాటంగా పాతిపెట్టబడతాయి

ఈ రామాయణం కవిగాళ్ళూ, వాళ్ళ శిష్యప్పరుగులూ, అగాధమీమార్కుముక్కుపొడుం వయాకరుణులు, సినిమా రంకుకవులూ, ఈ సాహిత్య బొద్దింకలూ, బల్లులూ ఎలకలూ, పందికొక్కులూ, కలుగుల్లోకి గునపాలు దిగి చంపబడతారు.

ఇది యిక్కడేకాదు, ప్రపంచవ్యాప్తంగా జరగబోతోంది. బలహీనపరచబడిన ప్రపంచం, దిక్కులేకుండా తరమబడిన ప్రపంచం, అనాధుల ప్రపంచం, ఆక్రందనలు వినా, ఆదుకునే దిక్కులేని ప్రపంచం యిప్పుడిప్పుడే మేలుకున్నది. ప్రపంచ దేశాలన్నిటా ఈ ప్రపంచం ఆకాశమంత ఎత్తున లేస్తున్నది. ప్రజా చరిత్రని తిరిగి రాయబోతున్నది. నిజమైన సామూహిక ప్రజా సంస్కృతిని మనిషి రక్తంలో రంగరించబోతున్నది.

ఆ ప్రజా ప్రభుత్వం వైపు, ఆ సామూహిక ప్రజా సంస్కృతివైపు విప్లవాలు యిప్పుడే పుష్పిస్తున్నాయి.

అందుకే అన్నాను —

1971 ఆగస్టు రెండోతేదీ చరిత్రలో తలెత్తుకు నిలబడే తేదీ.

ఈ సంఘటన ఆధునిక తెలుగు కవితకి తొలి విజయం.

—నగ్నముని.

# సమాజం - కవిత్వం - విప్లవం

ఆద్దేపల్లి రామమోహనరావు

## 1 – పూర్వరంగం

సమాజానికీ, సాహిత్యానికీ అవినాభావసంబంధం ఉందనీ, సామాజికపరిస్థితులు సాహిత్యంలో ప్రతిబింబించక తప్పదనీ, ఈకాలంలో బాగాప్రచారంలో ఉన్నసిద్ధాంతమే. సామాజిక పరిస్థితుల్నిబట్టి, ఆయాకాలాల్లోని సాంఘిక విశ్వాసాల్నిబట్టి, సాహిత్య స్వరూపంలో మార్పువస్తుందని గూడా బహుసంఖ్యాకులు విశ్వసించేదే, కాని. సాహిత్యంలో ఒక వినూతన ఉద్యమం తలయెత్తినప్పుడు, ఆ ఉద్యమానికీ, సంఘానికీ ఉన్న సంబంధం గూర్చి, దానిమూలతత్త్వం గూర్చి, కొంత లోతుగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

సాహిత్యంలోగల స్వరూపాలన్నిటిలో ముఖ్యంగా ఈ వ్యాసంలో కవిత్వాన్ని గూర్చి చెప్పదలచాను కాబట్టి, కవితోద్యమం ఎట్లాప్రారంభమౌతుందో, సమాజానికీదానికీ గల సంబంధమేమో ఆలోచించవలసి ఉంది. సమాజం ఏకాలంలోనూ, ప్రతివ్యక్తికీ సంపూర్ణ సంతృప్తినిచ్చేదిగా ఉండదు. ఒక్క వర్గరహితసమాజంలో మాత్రమే సాధ్యమైనంతగా తృప్తికలిగే అవకాశం ఉంది. అంతవరకు భౌతికజీవితంలో కొందరికి తృప్తీ, కొందరికి అసంతృప్తీతప్పవు. భౌతికజీవితంలోగల హెచ్చు తగ్గులు, అందువలన కలిగేబాధలు– వీటిని నివారించడానికి ఏకాలంలోనైనా మేధావులు ఆలోచనచేస్తూ ఉంటారు. ఈ భౌతిక అసంతృప్తి లక్షణం చరిత్రలో ప్రతికాలానికీ సమానంగా ఉండదు. సామాజిక పరిస్థితులు మారినకొద్దీ, అసంతృప్తీ లక్షణాలు మారవచ్చు. ఈ అసంతృప్తి నివారణకి మేధావి ఆలోచనాపూర్వకమైన నివారణపద్ధతిని సిద్ధాంతీకరిస్తే, కవి హృదయస్పందనవి ఆలవాలం చేసుకుని, ఆ నివారణ పద్ధతిని జనులకు బోధించడానికి ప్రయత్నిస్తాడు. తనకాలపు సంఘంలో ఉన్నబాధల్ని నివారించే ఆలోచనా పద్ధతికి హృదయగతమైన అనువాదమే కవిచేసేరచన. కొత్తరకమైన బాధలు సంఘంలో రగలడం వాటికి కవి కొత్తనివారణ పద్ధతిని బోధించడం– ఇదేఒక వినూతనకవితోద్యమాన్ని నిర్మిస్తుంది. కవితోద్యమ చరిత్రలన్నీ ఈ సిద్ధాంతాన్నే ఋజువుచేస్తై.

ఈ పైమాటల్లో కొందరికి ఒక సందేహం కలిగే అవకాశం ఉంటుంది. సమాజంలో ఎప్పుడూ, భౌతికమైన సమస్యా నివారణకొరకే మేధావి పూనుకోవడ మేమిటి? ఆత్మవిముక్తికి, ఆధ్యాత్మికంగా జరిగే కృషిమాట యేమిటి? అని. కాని, ఏకాలంలోనూ భౌతికమైన అసంతృప్తిలేకుండా ఆధ్యాత్మికమైన కృషిలేదు. భౌతికమంటే కేవలం తిండి, బట్ట మొదలైన జీవితావసరాలలోటు కావచ్చు: లేదా ఒక మానసికమైన అసంతృప్తి కావచ్చు. ఏకాలంలోనైనా వీటిలోనుండే ఒక ఆధ్యాత్మికతృష్ణ బయలుదేరుతుంది. ఆ బాధా నివారణకొరకే, మనిషి తనలో తానులీనమై ఆనందాన్ని వెదుక్కోవడానికి ప్రయత్నిస్తాడు. భౌతిక, మానసిక అసంతృప్తి లేనివాడెవ్వడు ఆత్మానందం కొరకు మనస్ఫూర్తిగా (అంటే సర్వమూత్యజించి ప్రయత్నించడం. దొంగమాటలు చెప్పడం కాదు) పూనుకోడు. దీనికి ఉదాహరణ చెప్పడం అవసరం. బుద్ధుణ్ణితీసుకుంటే, అతడు లోకంలోని సామాజికమైన బాధలనూ, హింసనూచూచి, వీటినుండి జనులకి విముక్తి కలిగించడానికి మార్గాన్ని వెదికాడు. అతని ప్రయోజనం, సంఘమంతా ఒక శాంతిని సాధించి, మానసికంగా ఆనందంతో ఉండటమే. సర్వవేదాంతానికీ "ఆత్మానంద"మే మూలప్రయోజనమన్నది జాగ్రతగా ఆలోచింపదగింది. తర్వాత మరోమహావేదాంతి వివేకానందుణ్ని తీసుకోవచ్చు. ఆస్తికతనీ, ఆత్మానందాన్నీబోధిస్తూనే, తన జీవిత ధ్యేయాన్ని పేదరికం తొలగించడం చేసుకున్నాడాయన భౌతికంగా తననాటి హిందూ దేశంలోని పేదరికమే ఆయన వేదాంతానికి మూలమైంది. ఇట్లా ఏకాలం తీసుకున్నా. వేదాంతం సామాజిక భౌతిక ఉపశాంతికొరకు సాగింపబడిందే. కాని, దానినుండి ఏవో అలౌకికమైన శక్తులు దిగివచ్చికాని, లేక దేవుడేవచ్చిగాని, లోకాన్ని మారుస్తాడనికాదు. అట్లా యిన్నిలక్షల సంవత్సరాలనుండీ ఎప్పుడూ జరగలేదు- జరగదు. అందువల్ల ఆధ్యాత్మికాన్వేషణకి మూలం మానసికమైన అశాంతి, ఆందోళన– లేక నిత్యావసరాల లేమిచేత కలిగిన అసంతృప్తి– యివిమాత్రమే. వీటికొరకే, ఆధ్యాత్మిక సాహిత్యం కూడా ఒక్కొక్క కాలంలో ఉద్యమరూపం ధరిస్తుంది. ఉదాహరణకి బౌద్ధసాహిత్యం చూడవచ్చు: వీరశైవ సాహిత్యాదుల్ని చూడవచ్చు.

ఇప్పుడు తెలుగు కవిత్వంలో జరిగిన ఉద్యమాల స్వరూపాన్ని స్థూలంగా పరిశీలిస్తే, భౌతికజీవిత అసంతృప్తి ఎట్లా ఉద్యమాల్ని నడిపిందో అవగాహనకాగలదు. మొట్టమొదటగా నన్నయభట్టు యొక్క భారతావతరణ, వైదికధర్మోద్ధరణ కొరకు జరిగిందని సాహిత్య, చరిత్రచెప్తుంది. జైన బౌద్ధమతాలమీద ఆంధ్రదేశ జనులకు కలిగినప్రీతి, వైదికధర్మానికి తీవ్రమైన విచ్ఛిన్నతతెచ్చే ప్రమాదం ఏర్పడింది. సాంప్రి

దాయికమైన జీవనవిధానం, మానసిక లక్షణాలు పూర్తిగా మారిపోయే ప్రమాదం కలిగే టట్లు కనిపించింది. ఈ ప్రమాదాన్ని రాజుచూస్తూ ఊరుకోలేడు- ఎందుకంటే, సాంప్ర దాయిక. వేదవిహిత జీవితంలోనే సామాజిక భద్రత ఉన్నదని ఆనాటి విశ్వాసం. ఆ సామాజిక భద్రతకాపాడబడాలి. అందుకే జనానికి వేదధర్మం ప్రచారం కావాలి. పౌరాణిక కథల్లోగల జీవనమార్గం ప్రజలకి తెలియాలి. అందుకని భారతాన్ని రాజరాజ నరేంద్రుడు నన్నయచేత రాయించాడు. సాంప్రదాయికమైన జీవనవిధానానికి కావలసిన లక్షణాల్నిబోధించే కథలు భారతంలో ఉన్నై. అదిగాక, భక్తినీ, ముక్తినీ వేదసారంగా బోధించేశక్తి భారతంలోని కథల్లో ఉంది. అందుకని భారతం అవతరించడం ఆనాటి భౌతికావసరం.

తర్వాతి గొప్ప ఉద్యమం వీరశైవ సాహిత్యం. ఇది చాలా ఉగ్రవాదం. శత్రు వుల నెత్తురుపారించి, పుణ్యం సంపాదించమన్న వాదం. శివుణ్ని పూజించని మొగుణ్ని వదిలెయ్యమనీ, శివుణ్నిపలకని నాలుక తెగ్గొయ్యమనీ ప్రచారం చేసినవాదం. నిజానికి వీరశైవసాహిత్యం భాషలో, ఛందస్సులో, వస్తువులో అపూర్వమైన మార్పునుకోరి నిజమైన ప్రజా ఉద్యమమే ఐంది. కాని, కేవలం అది మతమూర్ఖతామూలకం. తమ మతమే ఆత్మశాంతినిస్తుందనే భ్రాంతిలోనుండి పుట్టిన ఉద్యమం. సమస్త వ్యవస్థనీ భౌతికావసరాలకి తగ్గ మార్పుకు ఎట్లా మళ్ళించాలి అనే ఆలోచన యీ ఉద్యమంలో లేదు. శివమరులే దానికి చుక్కాని— అందువల్ల త్వరలో నాశనమైపోయింది.

తర్వాత చెప్పుకోదగ్గ మలుపు ప్రబంధసాహిత్యమే. ప్రబంధకాలానికి జనుల జీవితం ఒడిదుడుకులు తగ్గి సుఖశాంతులతో ఉందనీ, భోగానుభవమే ప్రతివారికీ లక్ష్యమనీ, దారిద్ర్యంలేదని, అందరూ శృంగారంలోనే మునిగితేలారనీ, అందుకే ప్రబంధాలు శృంగారరసపూర్వకమై, సౌందర్య భావనాత్మకమై, మధురశైలిలో ఉన్న యనీ, చాలామంది విమర్శకులు చెప్పారు. రాయలనాటి రసికతాజీవితాన్ని గూర్చి పుస్తకాలు రాయబడ్డయి. ఈ ఊహాలకాధారం ప్రబంధాలలోని వర్ణనలే. సాహిత్యం సమాజ ప్రతిబింబమని ఒక సిద్ధాంతాన్నినమ్మి, దానిప్రకారం కొలిచి, ప్రబంధాల్లోని భోగాలు ఆకాలంలో అందరికీ ఉండిఉంటై అనే ఊహతో రాయబడ్డ విమర్శలివి. కాని, ఏకాలంలోనైనా సాహిత్యం కవి ఊహలోనుండే జనిస్తుందనీ, కవి ఒక ప్రత్యేక వర్గాన్ని ప్రతిబింబిస్తాడనీ, అవగాహన యిటువంటి విమర్శకులకులేదు. ప్రబంధకవులు రాజులయొక్క ధనవంతులయొక్క భౌతికావసరాలకోసం పుట్టినవాళ్లు. వాళ్ళ జీవితం

లోని అసంతృప్తి తొలగించే రచనయే ఆ కవుల కవితోద్యమధ్యేయం. ప్రజలు వారి కవసరంలేదు. అందువల్ల ప్రబంధకవితోద్యమం, రాజుల, ధనవంతుల మనస్సుల లోని, శృంగార సౌందర్యతృష్ణ అనే భౌతికావసరాన్ని తీర్చడానికి పుట్టిన ప్రక్రియ మాత్రమే. వాళ్ల సౌఖ్యమే లోకకల్యాణం అని కవుల భావం.

దాదాపుగా 20 వ శతాబ్దం వెలుగుచిమ్మేదాకా ప్రబంధమార్గమే రాజ్యం చేసిం దనుకోవచ్చు. నన్నయనించీ, 20 వ శతాబ్ద, ప్రారంభందాకా ఏ ఉద్యమాలు ఏవిధంగా ఉన్నా, సాహిత్యమంతటికీ కొన్ని సమానలక్షణాలున్నై. ఎందుకంటే సామాజిక జీవితంగూడా అప్పుడప్పుడు కొద్దిమార్పులతో, ఒకేవిధమైన జీవన ప్రణాళికమీదనే నడిచింది. ఈ సాహిత్యమంతటిలో సమానలక్షణాలు ముఖ్యంగా ఏమిటంటే, కథా రూపంగా ఉండటం, రసానందం కలిగించడం— తద్వారానే సంఘంలో, మనిషిలో ఏమార్పునైనా ఆశించడం- కథారూపంగాని, రసానందాంగాని, మనిషికి అప్రత్యక్షమైన నీతిబోధచేస్తై. సూటిగా మనిషి హృదయాన్ని కదిలించి నడిపించడం వాటికి ధ్యేయం కాదు, అట్లా సూటిగా కదిలించవలసిన అవసరం 20 వ శతాబ్దిందాకాగల సమాజానికి లేదు, జీవనవిధానానికిలేదు. సంఘాన్ని సత్వరం మార్చాల్సిన అవసరాన్ని కవులెప్పుడు భావించవలసిన అవసరం లేకపోయిందో, అప్పుడు ఆనందం ప్రధానమైంది, బోధన అనుషంగికమైంది. ఆనందంకోసం రసం పుట్టింది; మేధాగత శిల్పం పుట్టింది. ఇంకా అనంతకోటి ఆలోచన ప్రధానమైన రచనారీతులు పుట్టినై. రెండువర్గాల్ని విడివిడిగా ఉంచి, ఒకవర్గం పెత్తనంచేసి మిగిలినవాళ్ళని అణిచి ఉంచడానికి, పద్యమూ, అందులో ప్రజాభాషగాక గ్రాంధికభాషా వినియోగింపబడ్డై. భాషాక్లిష్టతకి ఎంతో ప్రాధాన్య మియ్యబడింది. సాహిత్యమంతా ఒకవర్గపు గుత్తసొమ్ముగా మారిపోయింది. ఈలక్ష ణానికి విరుద్ధంగా అప్పుడప్పుడు శతకాలు మొదలైన ప్రక్రియలు తలయెత్తినైకాని, ఏవర్గం రాజ్యంచేస్తుందో, ఆవర్గం తల ఆకాశందాకా లేస్తుంది కాబట్టి, మిగిలినవన్నీ అణచబడినై. ఇట్లా అణచబడిన ఉద్యమాలు, ప్రజాజీవిత ప్రతిబింబమైన పుస్తకాలు ఎన్నికాలపు చీకటికోణాల్లో మూలుగుతున్నయో మనకు తెలియదు- వేమన శతకాదులు కొద్దిగా మాత్రమే కొందరు జనుల ఆఅభిమానాన్ని పురస్కరించుకుని జీవించి ఉన్నై.

మొత్తంమీద కవితోద్యమం ఆనాటి జీవితాన్ని ప్రతిబింబిస్తుందనడం కాకుండా, ఆనాటి భౌతికజీవిత అసంతృప్తిని తొలగించడానికి బయలుదేరుతుందన్నది యథార్థం. కాని, ఎప్పుడూ ఏ ఉద్యమాన్నీ కవులందరూ సమానంగా అర్థంచేసుకోలేరు. కవుల్లో

చాలామంది తమ ముందుతరంవైపు తలతిప్పి ఉంటారు. తమకాలపు అవసరాన్ని వాళ్లు గుర్తించలేరు. అందువల్లనే ఒకేకాలంలో సర్వప్రక్రియలూ నిలిచే ఉండడాన్ని గ్రహించగలం. నిలిచే ఉన్నప్పటికీ, సామాజిక సౌఖ్యానికి ప్రజల్ని మళ్ళించే, తత్కాల అవసరమైన ప్రక్రియ ఏదున్నదో, అదే ఉద్యమ మనిపించుకుంటుంది—

తత్కాల అవసరం చూసుకుంటే, త్రికాలాబాధిత సాహిత్యం సంగతేమిటని చాలామందికి సందేహం. కాని, త్రికాలాబాధితం— అని చెప్పబడే వింతవస్తువు ఎక్కడాలేదు కాలం మార్పుతో రుచిమారుతుంది: అవగాహన మారుతుంది. అనుభవం మారుతుంది. అవసరం మారుతుంది. వీటి పునాదులమీద సాహిత్యం నిలుస్తుంది. "నేను పూర్వసాహిత్యమే అనుభవిస్తున్నాను" అని ఎవరైనా అంటే, వాడి మనస్సు పూర్వంలోనే ఉంది అనిఅర్థం. ఈకాలంలో పూర్తిగా వాడు జీవించడంలేదని అర్థం. అదిగాక, ఏసాహిత్యంలోనైనా, ఎవరికైనా కొంత అనుభూతికలగక తప్పదు. కాని, ప్రధానలక్ష్యం ఏమిటి అన్నది ప్రశ్న. ఈ ప్రధానలక్ష్యం కాలాన్నిబట్టి మారుతుంది. ప్రబంధకవుల కాలంలో శృంగారం ప్రధానలక్ష్యం. అందుకే అదేకవులకు చుక్కాని ఐంది. ఈకాలంలో శృంగారం చుక్కాని కావలసిన అవసరంలేదు. అందుకే శృంగారకవులు ఈనాడు ఉద్యమం లోపాలు పంచుకునేవాళ్లు అయ్యే అర్హతలేదు. నాలో నీలో శృంగారం ఉంది కాబట్టి, నేను శృంగారం రాస్తాను అనేవాడు, కవిబాధ్యత, ఉద్యమలక్ష్యం, కాలపు అవసరం సరిగ్గా తెలియనివాడని అర్థం— కవి, తనకాలపు భౌతికజీవన అసంతృప్తిని తొలగించేమార్గాన్ని సందేశంగా అందజెయ్యాలనే రహస్యం గ్రహించనివాడని అర్థం—

తర్వాత ఇరవయ్యవ శతాబ్దినిగూర్చి పరిశీలించవలసి ఉంది—

(సశేషం)

# పెట్టుబడిదారీ సంస్కృతి?

కొడవటిగంటి కుటుంబరావు

కదిలే సమాజానికి రెండు లక్షణాలు విధిగా ఉండాలి. సమాజం తన వ్యవస్థకు అనుగుణమైన సంస్కృతిని ప్రదర్శించాలి: ఆ సంస్కృతిలో భవిష్యత్తుకు, అంటే పురోగమనానికి, అవసరమైన బీజాలు ఉండాలి.

ఈసూత్రం ఒక్క సాంస్కృతిక రంగంలోనేకాదు, జీవితం తాలూకు అన్ని రంగాలలోనూ వర్తిస్తుంది. వ్యవసాయ, ఆర్థిక, పారిశ్రామిక, విద్యాదిరంగాలలో, అమలు జరిగినా జరగకపోయినా, ఈ లక్షణాలు ఉండాలన్నది గుర్తించబడుతున్నది. ఒక్క సాంస్కృతిక రంగానికే గుర్తింపులేనట్టు కనబడుతుంది; దానికే ప్రణాళికలు లేవు మీదుమిక్కిలి అవాంతరాలు ఈరంగంలోనే హెచ్చుగా కనబడుతున్నాయి.

"Under Capitalism all art above a certain mediocrity has always been an act of political criticism and revolt" అన్నాడు Ernst Fischer.

ఈదేశంలో మనం అచ్చగా పెట్టుబడిదారీకిందనేగాక కొంతసామ్యవాదం కింద కూడా ఉంటున్నట్టు నటిస్తున్నాం; ఒకచేత్తో సోషలిజమూ, ఇంకోచేత్తో వెల్ఫేర్ స్టేటూ సాధిస్తామని ప్రపంచాన్ని నమ్మించజూస్తున్నాం.

కాని మనదేశంలో సంస్కృతికింద చలామణీ అవుతున్నది మన ప్రగల్భాలకు కనువేటుదూరంలో ఎక్కడాలేదు. రేడియోలో గంటగంటకూ ఓడే భక్తిరసం వినండి; అకాడెమీలు బహూకరించే పుస్తకాలు చదవండి; జ్ఞా(జ్ఞై)నపీఠంవారు ఏటా లక్షరూపాయలు చెల్లించే మహత్తర సాహిత్యాన్ని అవలోకించండి. సోషలిస్టు సంస్కృతిమాట దేవుడెరుగు, వాటిలో పెట్టుబడిదారీ సంస్కృతికూడా కానరాదు.

మనం సంస్కృతి అని బహిరంగంగా గుర్తించేదీ, పత్రికలు పెద్దపెట్టున హర్షించేదీ, కొంపదీసి, below a certain mediocrity గా ఉంటున్నదా?

మన సమాజంలో మనుషులకు కనీస ఆలోచనాశక్తీ, చైతన్యమూ లేనందుకు ఆందోళన కనబరుస్తూ నేను నలభైఏళ్ళక్రితం రచనలు ప్రారంభించాను. నేను పెరుగు

తున్నకొద్దీ నా ఆందోళన సాంఘిక చైతన్యంకేసి మళ్ళింది. ఈనాడు నేను గాఢంగా కోరుతుంటున్నది మనుషులలో విప్లవ చైతన్యం. కాని నాలో ఉన్న పెటీ బూర్జువా, "ఈ దేశంలో, కనీసం, నికరమైన పెట్టుబడిదారీ సంస్కృతి అయినా ఎందుకు లేదు?" అని విచారిస్తూ ఉంటాడు.

మన రచయితలలో చాలామంది రచనలు చేసేటప్పుడు తమ రోజువారీ అనుభవాలను కూడా అర్థంచేసుకోలేనట్టు ఎందుకు కనబడతారు? (మన పెళ్లాల, బిడ్డల ముఖాలుకూడా మనం పోల్చుకోలేకపోవటం ఎంత విషాదకరం!) మతమూ, కులమూ, నీతీ, విద్యా మొదలైనవాటిని గురించి బహుకొద్దిమందికి తప్ప వాస్తవం ఎందుకు తెలీదు? (మన జాతీయ వికాసం ప్రారంభమై అర్థశతాబ్దం దాటుతున్నదే! ఈజాతి ఊబిలో నుంచి పైకి రావటానికి ఎన్నిశతాబ్దాలు కావాలి? ఇది చేసుకున్న పాపమేమిటి?) మన పాలకులు ప్రజాప్రతినిధులుగా ప్రవర్తించక గొర్రెలను తోలేవారల్లే ఎందుకు ప్రవర్తిస్తారు? అరతులం మెదడున్నవారికి కూడా అవమానకరంగా తోచే అబద్దాలు ఎందుకు చెబుతారు? ప్రజలు గొర్రెలని వారనుకుంటూంటే, ప్రజలు నిజంగా గొర్రెలలాగే ఉండటం ఇంకా ఎంతదారుణం!

దశాబ్దాల తరబడి అవినీతి ఆరోపణలకు గురిఅయినవాళ్ళు ఇంకా అధికారం చలాయిస్తూనే ఉన్నారు. రాజకీయరంగంలో సంఘర్షణలేదనికాదు; అది పాలకవర్గానికి పరిమితమై ఉన్నది. ఒక ఇందిరాగాంధీ ఒక మొరార్జీదేశాయినీ, ఒక ఎస్. కే. పాటిల్‌నూ మట్టికరిపిస్తే అందులో ప్రజల రాజకీయ చైతన్యం ప్రతిబింబించదు. (ప్రజలు రాజకీయ చైతన్యం ఒక సాధారణ ఎన్నికలప్పుడే ప్రదర్శించినట్టు నాకు తోస్తుంది; ఆ ఎన్నికలో, మంత్రిత్వాలు నిర్వహించినవారి నందరినీ ప్రజలుకూడ బలుక్కున్నట్టు దించేశారు. అదిచూసి "అభ్యుదయ" రాజకీయవాదులు హర్షించి, మరింత చైతన్యంతో పనిచెయ్యటానికి బదులు విశ్రాంతి తీసుకున్నారు!)

రెండో ప్రపంచయుద్ధం అయిపోయే రోజుల్లో మహానుభావుడు శ్రీరంగం నారాయణబాబు నాతో, "ఈదేశానికి మొదటి శత్రువు మతం!" అంటే నేను నా అజ్ఞానంలో, "వెర్రివాడు! సోషలిజం వచ్చి మతం కోరలు లాగేస్తుంది." అనుకున్నాను. ఆ తరవాత రెండుమూడేళ్లకు మతాలు కొన్నిలక్షల ప్రాణాలను బలిపుచ్చుకున్నాయి. మతం బుసలుకొట్టుతూండగా సోషలిజం రాపటం కష్టసాధ్యమేమోనన్న అనుమానం నాలో చాలా ఆలస్యంగా తలఎత్తింది.

ఇటువంటి పొరపాటే కులాల విషయంలోనూ చేశాను. 1942 లోనే కులంగాడికి అంత్యక్రియలు చేశాను. కాని 30 ఏళ్ళ అనంతరం కులంగాడు ఎప్పటికన్నా జోరుగా ఉన్నాడు నేను కంపుకొడుతున్నదనుకున్నది కులంగాడి శవం అని భ్రమపడ్డాను. కాని అది బతికున్న కులంగాడి సువాసనే!

చెప్పవచ్చేదేమంటే, అట్టడుగున మన సమస్య సాంస్కృతిక సమస్య. అన్ని సమస్యలకూ అడుగున ఉన్న ఈ సాంస్కృతిక సమస్యను అర్థంచేసుకుని రాజకీయ, సామాజిక, సాంస్కృతిక విప్లవాలకోసం కృషిచేయదలచినవారు శాస్త్రీయంగానూ, సమిష్టిగానూ కృషిచేయటం జరిగినట్లయితే చీనావారు సాధించిన సర్వతోముఖ కృషి మనదేశంలోనూ జరిగి, ఈదేశంకూడా ప్రపంచరాజ్యాలలో మూడోస్థానం కాకపోతే నాలుగోస్థానమైనా ఆక్రమించగలిగేది.

కాని జరిగిందేమిటి? దేశం తన స్వాతంత్ర్యాన్ని నయావలసదార్లకు తాకట్టు పెట్టేసింది. కుక్కల దొడ్డిలాగానూ, పందుల దొడ్డిలాగానూ తయారయింది. పచ్చి ఫాసిజం విలయతాండవం చేస్తున్నది. ప్రజాసంక్షేమానికి ముఖ్యాధారాలైన విద్యా సంస్థలూ, పోలీసుశాఖా అవినీతికీ, అరాజకానికీ ఆయువుపట్లుగా మారాయి. సంతాన నిరోధంలాటి బైరాగి చిట్కాలు రాజకీయనినాదాలయాయి, పెట్టుబడిదారీ పత్రికలు పాలకవర్గంకన్న కూడా మరింత హెచ్చుగా ప్రజలను — విద్యాధికులను సైతం — దుష్ప్రచారానికీ, brain washing కూ గురిచేయటానికి శాయశక్తులా కృషిచేస్తున్నాయి.

ఉన్నపరిస్థితులపైన జుగుప్సా, ఆగ్రహమూ సాంస్కృతిక విప్లవానికి కాళ్ళు, సాయుధ విప్లవానికి సాంస్కృతిక విప్లవం వాహనం. సామాజిక విప్లవం రావటానికి అడ్డంగా ఉన్న ప్రతి ఆటవిక, జమీందారీ, బూర్జువా లక్షణాన్నీ చించి చెండాడటం విప్లవ రచయితల సాంస్కృతిక వైఖరికావాలి. చైతన్యంగలవారికే చైతన్యం అందించటంలో పురోగమనంలేదు కాళ్లుకట్టేసి ఉన్నవారిని నడిపించాలి. అంటే, వాళ్ళకాళ్ళ సంకెళ్లు విడగొట్టాలి. పురోగమనానికి అడ్డంగా ఉన్న సాంస్కృతిక బంధాలు తెంచటం విప్లవ రచయితల కర్తవ్యం.

రాజకీయ విమర్శలూ, తిరుగుబాటూ పెట్టుబడిదారిలో అన్నికళలకూ ముఖ్య లక్షణమని ఫిషర్ అన్నాడు; అవి పెట్టుబడిదారీ వ్యవస్థలో కళలకుగల ముందుచూపుకు నిదర్శనాలు. కాని మనం ఈనాడు సాంస్కృతిక కీకారణ్యంలో ఉన్నాం. పెట్టుబడిదారీ వ్యవస్థతోపాటు దానిపూర్వ వ్యవస్థలుకూడా మనని పీడిస్తున్నాయి. వాటిని మనం ఉపేక్షించటానికి లేదు నరబలి మొదలుకుని ఏరాతియుగ లక్షణంనుంచీ పూర్తిగా బయటపడని దేశం మనది. అందుచేత విప్లవ రచయితలకు చేతినిండాపని.

## చెరబండరాజు

# కామ్రేడ్!

కత్తినీది కలంనాది
మన ఇద్దరి మధ్యనున్న
సిద్ధాంతం అందరిదీ
నీరంగం రణరంగం
నారంగం భావతరంగం

అడవి నీది ఆర్తినాది
మన ఇద్దరి శ్రమనాదం
సమ సమాజ నిర్మాణం
నీపయనం అజ్ఞాతం
నాకవనం గగనమయం

శక్తినీది యుక్తినాది
మన ఇద్దరి మధ్యనున్న
జనశక్తే మనరక్తం
నీకాళ్ళకు శిలువమేకులు
నాకాళ్ళకు వ్యథలరాళ్ళు

పొడిచి నిన్ను చంపుతారు
పొగిడి నన్ను చంపుతారు
మన ఇద్దరమెపుడైనా

ఈ సత్యం మరవవద్దు
నీనాదం ప్రజాసేన
నా నాదం జనవేదన

నిశ్శేషంగా శత్రువు
నిర్మూలన మనధ్యేయం
ఈ సుదీర్ఘ పోరాటం
అవిశ్రాంత ప్రభంజనం.

## జ్వాలాముఖి
### కాంతులకు చీకట్ల సంకెళ్ళు

మహోన్నత మానవతా చరణాలు
శ్రామిక న్యాయం క్రాంతి కిరణాలు
నవశక్తిని సంధించిన అజరామరణాలు
చీకటి కోణాన్ని ఛేదిస్తూన్న ఉదయారుణ కిరణాలు

బోనులో నిలుచున్నారు
మానవతా పులుల్లాగ
నిప్పుల సలాకల్లాగ
నిరుపేదల అరుణ పతాకల్లాగ

వాళ్ళ
వయసు విప్లవం
వృత్తి విప్లవం

బతుకు విప్లవం
బతుకుతెరువు విప్లవం

*   *   *

కాంతులకు చీకట్ల సంకెళ్ళు
ఉదయాలకు రాత్రిల పహారాలు
వీరత్వానికి భయాల అడ్డుగోడలు
జలపాతాలకు బండరాళ్ళ ఎదురీతలు
సింహ కిశోరాల చుట్టూ కాగితపు పులుల గాండ్రింపులు.

## నిఖిలేశ్వర్

### కోర్టులో నేరస్థుడు

నాదగ్గర ఇంకా దుర్వాసన
వేస్తోంది అనుకుంటాను!
ఇక్కడికి తేబడేముందు
తిరుగుబాటు వాసనవేసే
నా దుస్తులను కాల్చేసారు.

గాలింపు జరిగినపుడు
నా కళ్ళను, చెవులను, మెదడును
ఇంట్లో జాగ్రత్తగా పాతిపెట్టేసారు
ఇప్పుడీ చెవులు, మెదడు, కళ్ల
ఎక్కడివంటారా?
కొత్తకొత్తగా మొలుచుకొచ్చాయి లెండి!

ఇంకా దుర్వాసన వేస్తోందంటారా ?
నా గ్రామంలోని మట్టి
నా శిరల్లో ఇంకి నాతోబాటే వచ్చింది
ఆ వాసన తిరుగుబాటుది మాత్రమేకాదు
ఆకలితో అలమటించి
నాలో చచ్చిన ఒక కుందేలు
వాసనకూడా జతకలిసింది

అగ్ని పుష్పాలను మొలిపిస్తామనే
వాళ్ళలో నేనొకణ్ణి
ధరిత్రి గర్భపాతాన్ని ఆపడానికి
నిత్యం బాధల్ని సహిస్తున్నవాణ్ణి.

మేమూ అందరిలానే
విసిగి వేసారిన ప్రాణులం
అయినా సానుభూతి కట్టెలతో
నడిచేవాళ్ళం మాత్రంకాదు,
ఇతరుల సానుభూతి అక్షరాలు
మాతాల విరిగిన చెప్పుల్లాంటివి మాకు.

మేము ఏసుక్రీస్తులం
మా చేతుల్లో — కాళ్ళల్లో
క్షణాల దిగబడిన మేకులు
తలపై పొడిచిన త్రిశూలం
శరీరంపై మొలచిన ముళ్ళు;
మాటల జెండాలు
కుర్చీలో కూచొని ప్రశ్నించే
ఒంటెల బొమ్మలు

నా జేబులో దొరికాయి
నన్ను పట్టుకొన్నపుడు.

నా పేరంటారా ?
నా పేరు— 'సూర్యుడు' !
మా నాన్నగారా ?
నాన్న అనేవాడెవడూలేడు.
చీకటి సాలెగూళ్లో చిక్కినప్పుడల్లా
అనాథగా మారిన కన్య
నాలాంటి తిరగబడేవాణ్ణి కంటుంది.

నాది అనే పట్నంలేదు
నాది అనే దేశంలేదు
ఇంతకాలం నాదేశమనుకొన్న దేశం
నన్ను విదేశస్థుడిలా చూసింది !

నా శరీరంలో దాక్కొన్న మట్టి
మీ న్యాయాన్ని పసలేని మాటల్లా
చచ్చి గబ్బుకొడుతున్న ఎలుకలా భావిస్తోంది.

నన్ను వెంటనే ఈ కోర్టులోనుంచి
ఉరికంబంవైపు నడిపించండి.

నా రక్తాన్ని ధరించి
ఈమట్టి గర్భవతి అవుతుంది.
మరో క్రీస్తు వస్తాడు
ముళ్ళ కిరీటాన్ని ధరించి—
ఈ మట్టిని ముద్దుపెట్టుకోడానికి.

( పంజాబీ మూలం— జగతార్ )

## కిషన్

## ఈ చీకటిపొద కూకటివేళ్ళుతెగాలి

తాతయ్య దాచిదాచి ఇచ్చిన
'ఆపద్ధర్మాల' 'కరెన్సీ' చెల్లదిక కాలబెట్టు!

నాయినమ్మ రుద్దిన 'బూచి' భీతి
'నల్లరంగు' బాగుండలేదు,
మనసు కడుక్కొందాంరా,
వెలుగుల వెల్ల వేద్దాం!

నీమీద కూచున్నవాడు—
ఎత్తెయ్... ఎవడు వాడు ?...
వాడే 'హక్కు' అక్షరాల్లో
దాక్కున్న బక్కవెధవ... !

వాడు మనిషిమీద పెరిగిన మనిషి—
వాడే బూచి,
దించు వాణ్ణి,

పొట్టచీల్చి,
మిరాసా కవచంలోంచి విడిపించి
కాసేపు కార్మిక గీతం పాడిద్దాం!

జాతర్లకు జాతర్లు బెదురుతున్నాయ్.
గుళ్లోని దేవుడిబొమ్మ గుండెలు చెదురుతున్నయ్.
ఇంకా ఈమూలలో కూచుని కళ్ళుమూసుకోవడమే
ఖర్మనిపించుకుంటుంది—!

'మనవాళ్ళు' సహృదయంతో పెంచిన
ఈ నందన వనంలో
చాపులాంటి శాసనాల జిల్లేళ్ళునాటారు,
కొత్తభావాలు చొరకుండా
బ్రహ్మజెముళ్ళ కంచెవేసుకున్నారు—
అభివృద్ధి గ్రహాంతరయానాలుచేసి,
వినూత్న సౌకర్యాలు సృష్టిస్తోంది.
ఇంకా ఈమూలలో ఉంటే ఏం బాగుంటుంది చెప్పు?

అందుకో ఆపక్కనుంది గొడ్డలి!
లోకాల్లోని గాలిమొత్తం పీల్చి గుండెల్లో బిగబెట్టి
భూగర్భంలోని వేడినంతా పీల్చి
భూ్రికుటిలో ముడివేసి
మా అందరి బలాలూ నీకరాల్లో
ఎప్పుడూ నిలువలుంటాయ్—
అందుకే— ఇంకెందుకూ సంశయం వేసెయ్ వేటు—!

ఈ చీకటిపొద కూకటివేళ్ళు తెగాలి
నీ గమ్యం ముందుకు సాగాలి.

# బందిఖానాలో బాలచంద్రుడు

కె. వి. రమణారెడ్డి

ఆకాశం అంటుమామిడిపండును కత్తిదోటితో నేలరాల్చారు
అరణ్యం ఎర్రనైన వెచ్చటిగుండెను సుత్తిపోటుతో నలగబొడిచారు
బాలచంద్రుడి ఆజానుబాహువులకు బేడీలు తగిలించారు

సువర్ణమయమైన కోమల స్తంభాన్ని కటికనేలమీద పొర్లించారు
సువర్చలత్వాన్ని వల్లకాటి నల్లటిమట్టి మశానంలో దొర్లించారు
బాలచంద్రుడి చిగురువేళ్ళ చిగుళ్ళలో సూదుల్నిదించారు

జైలుకిటికీ చువ్వలలోనుంచి చల్లగా కిందికి వరదగట్టింది
జైలు కటకటాలకు కూడా అపూర్వమైన స్వర్ణయోగం చూపెట్టింది
విరిగినప్పటికీ తెగిపోని తునిగిపోని బాలచంద్రుడి చెయ్యి

వస్తూవస్తూ తూర్పుగాలిని వెంటబెట్టుకొని వచ్చినట్లుంది
వగుస్తూ వగరుస్తూన్న బందీ బంధువులకు ఊపిరినిచ్చింది
నీరసించినా నిస్తబ్ధంకాని నిస్పృహచెందని బాలచంద్రుడిచెయ్యి

ఆకాశపై శాల్యాన్నీ అరణ్యపై పుల్యాన్నీ ప్రవేశపెట్టింది
లోకాలోకనశక్తిని భావాంధులకైనా సమకూర్చిపెట్టింది
రెప్పలు మూతలుపడుతున్నా కనుముయ్యని బాలచంద్రుడిచెయ్యి

తలుపుకీ ద్వారబంధానికీ మధ్యచిక్కుబడి నొక్కుబడి
నలిగి గిలగిలలాడుతూంది బాలచంద్రుడి వెన్నెల చెయ్యి

అడివి తలచిక్కువిదిలించే మత్తువదిలించే గాలి
ఆవురావురు మంటూన్న బాలచంద్రుడి ఒళ్ళు నిమిరింది

రమణీయమైన శుక్లపక్ష విదియనాటి లలితమైన రాత్రి
రక్తమోడుతూన్న బాలచంద్రుడి చుట్టూ శిథిలమౌతూంది

ఇది ఆరబయలుకాదు అడివికాదు
ఇల్లుకాదు వల్లకాడైనా కాదు
జైలు

పాపై చీకటి కాంతినిమింగి నోరప్పళిస్తూంది
ప్రాణం ప్రహరీగోడల నడుమ సొమ్మసిల్లుతూంది
క్షతగాత్రులైన నక్షత్రవీరులు నెత్తురు కక్కుతున్నారు

తెల్లవారిందా మరి
జైలు జూ అవుతుంది
జైలరే ఇక బందీ
తెల్లవారితే చాలు
వెల్లివిరుస్తుంది పగలు
వెండికత్తుల పట్టపగలు

చంద్రుడు కాదు
చండ్రనిప్పుల చండభానుడు
చాల్కోలల చేతులెత్తుతాడు చూడు.

## త్యాగాలకు విజయం తప్పదు

ఎక్స్ - రే

ఆకాశం మొత్తం
ఎర్రబావుటాల పందిరిలా ఉంది
భూమి భూమంతా
ఎర్ర సిద్ధాంతం పారుతున్న వేదికలా ఉంది

మనుషులంతా
శతృవును వెంటాడుతున్న
సాయుధయోధుల అంగాలుగా కదుల్తున్నారు
శత్రువుమీద ఐక్యత దైన్యమైట్లతో పడుతున్నారు
రాబందుల రెక్కలు తెగనరుకుతున్నారు
విప్లవం మహానది కుళ్ళునంతా కుట్రనంతా కడిగేస్తున్నది
పంట పొలాలకు నీళ్ళందిస్తున్నది

ఈ గాలివానకి
ఈ నదుల వరదకి
ఏమి నిలుస్తుంది మంచితప్ప
ఏమి మిగుల్తుంది మానవత తప్ప
మార్పు తప్పదు
త్యాగాలకు విజయం తప్పదు
ప్రగతి పతాకం సమున్నతంగా ఎగరక తప్పదు

## మరో నాగరికత

'అశ్విని'

అడవి అందంగా కన్పిస్తుంది—
పులుగూ పుడకా అనుకుంటూన్నమాట వింటేతప్ప!
అడవి అందంగా కన్పిస్తుంది—
బ్రతుకడానికి భయపడే చిన్నకారు ప్రజ బాధకంటేతప్ప!

ఎన్నో ఆకులు రాలతాయి అడవిలో—
రాలిపోయిన ఆకుల్ని లెక్కపెట్టేదెవరు?
ఎంత వెన్నెల కురుస్తుందని అడవిలో!

పొదలక్రింద నలిగే గడ్డిమొక్కల కేంతెలుసు ?
చెల్లాచెదరయ్యే పక్షులకీ
చెట్టుక్రింద భయపడుతూ నిక్కిచూచే కుందేళ్ళకీ
అనుక్షణమూ బ్రతుకు ఒకపెద్ద సమస్య.
అడవి అందంగా కన్పిస్తుంది—
పులుగూ పుడకా అనుకుంటూన్న మాట వింటేతప్ప !

ఎప్పుడో రాకపోరు అడవికి మనుష్యులు
ఎదఎదపై తుపాకితో
మదిమదిలో తురాయితో
అడుగడుగున వేగంతో
ఊపిరిలో విశ్వాసంతో
ఎప్పుడో రాకపోరు మనుష్యులు !

బ్రతుకు భయంగావున్న పులుగూ పుడకా
ఆనందంగా చూస్తాయి,
గుహలో పొదలో పొంచివున్న
పెద్దపుళ్ళని చూపి హెచ్చరిక చేస్తాయి—
మనిషికి గొడుగు పడతాయి.

ప్రేలిన ప్రతిగుండుకీ కూలుతుంది ఒక పెద్దపులి
ప్రేలిన ప్రతిగుండుకీ అడవి ఆనందంతో ప్రతిధ్వనిస్తుంది.
అడుగడుగునా రాలిన ఆకుల్ని చూడలేని దొరలు
చచ్చిన ఒక్క పెద్దపులికీ గగ్గోలుపెడతారు !
అనేకానేకం నిషేధాలు పెడతారు
పోరాటానికి సిద్ధపడ్డ మనిషికి చావు ఒకవరం !
నేటి మన సమాజ వ్యవస్థ
ఒక అయిపులేని అడవికాదా మరి ?!

# తూర్పు పవనం వీచెనోయ్

గంగు

తూర్పు కనుమలలోన
కార్చిచ్చు రగిలింది
తూర్పు సంద్రంలోన
బడబాగ్ని పగిలింది

తూర్పు పవనం వీచెనోయ్

అడవులను అణచుటకు
నగరాలు నడచినవి
అడవి మిణుగురులొచ్చి
అంతటా మండినవి

సంద్రాన్ని చల్లార్చ
వాహినులు కదిలినవి
ఆర్పబోయిన తామె
నీర్‌గారి పోయినవి

తూర్పు పవనం వీచెనోయ్
సమతా తీర్పు పవనం వీచెనోయ్.

# ఉద్యమం నెలబాలుడు

నటరాజమూర్తి

ఎర్రని తూర్పు వాకిలిలో నిలుచొని
బంధూక్‌లో మందు మరింతగా దట్టించి
ప్రక్కనే వుంచుకొని
నా రక్తంతో వ్రాస్తున్నాను ఈ బహిరంగ లేఖ
ఈ లేఖలో జనహృదయాన్ని స్పందిస్తున్నా—
డియర్ కామ్రేడ్!
ఉహుఁ... కాదు... మిస్టర్ రెనగేడ్!
చల్లకొచ్చి ముంత దాయటం
నా రక్తంలో లేదు
ఉన్నది వున్నట్లు కుండబద్దలు కొట్టినట్లు
చెప్పటం అందరికీ శ్రేయస్కరం!

నిన్ననీవు విప్లవ వీరుడివి
నేడో నీవు విప్లవ విద్రోహివి
నిన్న నా కామ్రేడ్‌వి
నేడు పక్కా రెనగేడ్‌వి!

మనగడ్డలో సాయుధపోరాటం పొందిన
తాత్కాలిక అపజయానికి అదిరి
విముక్తి పోరాటంలోని
ఆటుపోటులకు గుండె చెదిరి
విప్లవ విద్రోహ వీలునామాపై నిర్లజ్జగా సంతకం చేస్తున్నావ్!
నీగొంతు నీవే పిసుక్కుంటున్నావ్!

నిన్ను నీవే హత్య చేసుకుంటున్నావ్ !
నిన్న ప్రజాపరం చేసిన నీ జీవితాన్ని
నేడు శాసనాల మురికిసందుల్లో వెదుక్కుంటున్నావ్ !
మరణం ముందుజాలిగా ప్రాధేయపడుతున్నావ్ !

'మన ఉద్యమం నెలబాలుడు
ఆజానుబాహుడు
కాబోయే అనంత బలసంపన్నుడు' అని మరిచిపోతున్నావ్ !
రెనగేడ్ !

ప్రయాణం పదివేల మైళ్ళని
ముందే అనుకున్నాం అవునా ?
పది అడుగులు వేశామో లేదో
అపుడే ఎందుకింత ఆయాసం ?
ఈనావ చేరవలసింది
సుదూర తీరమనీ
మార్గ మధ్యంలో
పెనుతుఫానులు, సుడిగుండాలు
తప్పవనీ ముందే అనుకున్నాం అవునా ?
నిన్న లంగరు ఎత్తామో లేదో
అపుడే ఇంత ఖంగారు ?
ఈ దోపిడి పర్వతాన్ని తవ్వాలని
నిన్న నడుంకట్టి
రెండుపెల్లలు కుల్లగించామో లేదో
అపుడే వెల్లకిలపడితే— ఏం ఫాయిదా ?
హిమాలయ పర్వతారోహణకు
బయలుదేరి రెండే రెండురోజులు

అప్పుడే గుండెదడ! శోకపీకుడు!!
శాపనార్థాలు! హఠయోగం!
విప్లవ పోరాటం వెల్లగుర్రంమీద స్వారీ అనుకున్నావా స్వామీ!

పులి గుహలోకి
వెళ్ళ సాహసించిన వాడే
పులిపిల్లను పట్టితెస్తాడు!
వెయ్యి కత్తివేట్లకు
జంకనివాడే
రాజును పదవీభ్రష్టుణ్ని చేస్తాడు!
విప్లవ పోరాటం నల్లేరుమీద బండి అనుకున్నావా?

మాబాట నెత్తురుమడుగు!
మాబాట కన్నీటికడలి!
మా పోరాటం తుదివరకూ
జయాపజయాల కలనేత!
అది అనంత త్యాగాలనేత!
రెనగేడ్, ఖబర్దార్!
నిన్న నీవు వల్లించిన సూక్తులనే
నేడు ఎలుకలా సగం సగం కొరికేస్తున్నావ్!

ప్రజలు నీపై వర్షించిన అంతులేని విశ్వాసానికి విద్రోహంచేసి
కనుపించని రాజీలకు దిగి
సాయుధ పోరాటానికి సాష్టాంగ నమస్కారం చేసి
శత్రువు పెట్టే హద్దుల్లో
ముద్దులొలికే ఉద్యమాలను ఉద్ధరించాలనీ
లోకసభ తోలుబొమ్మలాటలో
మరోకేతిగాడు కావాలనీ

బంగారక్కతో సిగ్గువిడిచి తైతక్కలాడాలనీ
బంజరు పెంజేరు పోరాటాలకు
మాదాకబళం మహాసంగ్రామాలకు
మళ్ళీ ఢంకా బజాయించాలనీ
సాయుధ పోరాటాన్ని సాపాటు పోరాటంగా మార్చాలనీ
విముక్తికోసం గాక భుక్తికోసం
జనరాజ్యంకోసం గాక
నిండు భోజనంకోసం
భవతీ! భిక్షాందేహీ! అనాలనీ
నేడు నీవిస్తున్న సలహాలు
చరిత్ర రథగమనానికి
అడ్డంగా విసిరే
పనికిరాని గులకరాళ్ళు!
రెనగేడ్!

విప్లవ వీరులు చిందించిన రక్తం
తడి ఆరకముందే
తెగిన వీరుల శిరస్సులకు
ఇంకా శతృవుచేసే మదింపు పూర్తికాకముందే
మన ఉజ్వల పోరాట చరిత్రను
తిరగ వ్రాద్దామనే నీతాపత్రియం, నీ తహతహ
నీ పిరికితనానికి చిహ్నం!

నా బొందిలో ప్రాణం వున్నంతవరకూ
నారక్తంలో జీవశక్తి జ్వలిస్తున్నంతవరకూ
నీ విద్రోహంతో చివరంటా పోరాడుతాను

నేను నేనుకాను
నేను గిరిజనుడు సారించిన విల్లును!

రైతు కసితో విరిసిన గండ్రగొడ్డలిని ;
కలకత్తా నడివీధిలో విగ్రహమహాత్మ్యణ్ణి విధ్వంసంచేసిన సమ్మెటను;
ఫ్యాక్టరీపై అరుణ పతాకాన్ని ఎగరేసిన కార్మికహస్తాన్ని ;
నేను నేనుకాదు
అధోలోకానికి పోతున్న సమాజ విమానాన్ని
హైజాక్ చేసినవాణ్ని ;
పోలీసు ఠాణాలో రైఫిళ్ళను
స్వాధీనం చేసుకున్నవాణ్ని ;
నేను నక్సల్‌బరీని ; ముషాహరిని ;
నేను శ్రీకాకుళాన్ని ;
నేను నేనుకాదు.
మృతవీరుల తనువునుండి
ప్రవహించిన రక్తంలో
ప్రభవించిన మానవుణ్ణి ;
అతి సామాన్యుణ్ణి, అసామాన్యుణ్ణి
అమరుణ్ణి, అజరామరుణ్ణి
నూత్న మానవుణ్ణి ;
నాదేశం ముందు వినమ్రుణ్ణి ;
అవును, నాదేశం, నన్నాదేశిస్తున్నది;
రక్తసిక్త విముక్తిబాటనే పయనించమని
నా ప్రజ నాకుపదేశిస్తున్నది;
సాయుధపోరాటం వినా మరోమార్గం లేదని
ప్రపంచ పరిణామం
ఇదే ఇదే పదే పదే చెబుతున్నది.
బంధూక్‌ను మరింత దృఢంగా పట్టేందుకు
జయాపజయాలను మననం చేసేవాణ్ణి నేను

మథన పడేవాణ్ణి నేను
బంధూక్‌ను వదిలేందుకు
అపజయాలను సాకుగా చూపించేది నీవు
వ్యక్తిగా పోరాటంలో మరణించినా
మహత్తర శక్తిగా ఉద్యమంలో నేను సదాజీవిస్తాను
నీవు పోరాటం వదిలి
కన్ను లొట్టపోయి
బ్రతికి బట్టకట్టినా
నీకన్న శవం నయం!

ఎర్రగా ఉదయించిన సూర్యుడు ఎర్రగానే అస్తమిస్తాడు!
రెనగేడ్!
నీ ఓటి రథాన్ని
పడమటి దిక్కుగా మళ్ళిస్తూ
తూర్పు వాకిళ్ళకు
ఎలా చేరుకుంటావ్!

జనం పదునెక్కారు
నీ విద్రోహాన్ని నిలువునా కోస్తారు
జనం పోరాటం చవిచూచారు
నీ బూటకత్వాన్ని లోతుగా తవ్వితీస్తారు
ఉద్యమం మెడచుట్టూ
నీవు పేనే కనిపించని ఉరితాళ్ళు
నీమెడకే జాగ్రత్తగా తగిలిస్తారు
మరింతగా విప్లవ జ్వాలల్ని రగిలిస్తారు
అపజయ అగడ్తలను దాటి
విజయం దిక్కుగా పయనిస్తారు

రెనగేడ్ !
నిన్న తొలిసంజలో
మనమధ్య పూలుపూచిన సాయుధమైత్రి
ఇక నేటితో చెల్లు !
కాలం పురోగమిస్తుంది– ఆగదు
విప్లవం జ్వలిస్తుంది– చావదు
ఉద్యమం నెలబాలుడు
పెరిగి పెద్దవాడై
వినూత్న జీవిత మహాకావ్యాన్ని రచిస్తాడు– తప్పదు.

## కరువొస్తోంది

యం. ప్రభాకర్

కరువొస్తోంది
వ్యాపారస్తులారా
ధాన్యాన్ని గోడౌన్‌లలోకి తరలించండి
చీకటి కొట్లలోపోసి తాళాలు వేయండి
రేపు– ధరలు పెరుగుతాయి / జనం తిండిలేక అఘోరిస్తారు
ధాన్యపు గింజలు దొరకక అలమటిస్తారు
అప్పుడు / బ్లాక్‌మార్కెట్‌ను తెరిచి / చీకటి కొట్ల సీళ్ళు విప్పి–
మన ఇష్టం వొచ్చిన రేటుకి అమ్ముకోవచ్చు
పిడికెడు బియ్యంలో రెండు పిడికిళ్ళ రాళ్ళు కలిపినా / జనం కొంటారు !
అందుకే– వ్యాపారస్తులారా / ధాన్యాన్ని గోడౌన్‌లలోకి తరలించండి
రైతులు పండించిన ధాన్యాన్ని / రైతులు అనుభవించకుండా చేసే శక్తి
మనకు తప్ప మరెవరికుంది ?

ఊఁ— మరేం భయపడకండి / మన జనానికి కళ్ళులేవు, బుర్రల్లేవు.
నిండిన మన గోడౌన్‌లను / బ్రద్దలుకొట్టి దోచుకునే దమ్ముల్లేవు
ఉన్నా మరేం ఫరవాలేదు
మనవైపు పోలీసులున్నారు— సైన్యం వుంది
నాయకులున్నారు— మంత్రులున్నారు
పైస పడేస్తే కుక్క విశ్వాసం చూపే గుండాలున్నారు
అందుకే కానివ్వండి పని
మనది ఆధ్యాత్మిక దేశం
నిర్భయంగా చీకటి కొట్లను నింపివేయండి!
మన జనానికి తిరుగబడే శక్తిలేదు / పోరాటం సాగించే యుక్తిలేదు
కరువొచ్చిందంటే... కష్టతల్లికి అన్యాయం జరిగిందనో
వానదేవునికి కోపం వచ్చిందనో / అమ్మవార్లకు బలులు తక్కువయ్యాయనో
భయపడ్తారు— పూజలు మొదలుపెడ్తారు
హోమాలు జరిపిస్తారు— బైబిల్‌లను తెరుస్తారు
ఖురాన్‌లను వల్లిస్తారు / అంతే—!
వీళ్ళ దృష్టి మనపైన పడదు
కనీసం తిండిపెట్టలేని పనికిమాలిన ప్రభుత్వం గురించి
వాగ్దానాలు చేసి— ఓట్లుదొబ్బి / వాటిని తీర్చని మంత్రుల గురించి
వీళ్ళసలు ఆలోచించరు
అందుకే వ్యాపారస్తులారా త్వరపడండి
లక్షాధికారులు కోటీశ్వరులయ్యే సీజన్ ఇది
ఒకవైపు బీదవాళ్ళూ, బిచ్చగాళ్ళూ వేల సంఖ్యలో పరమపదిస్తుంటే
మరోవైపు మనకు లక్షల సంఖ్యలో లాభాలువస్తూ ఉంటాయి
వ్యాపారస్తులారా కరువొస్తోంది
గోడౌన్‌లు నింపండి / ధాన్యాన్ని చీకటికొట్లల్లో కుక్కండి!

# మంచం

జంపన పెద్దిరాజు

"ఎంతైనా మొగుడుకదరా। అది అట్టాగే అంటుఁదిలే— నువ్వు— ఫో రేపో బస్తా గింజలు కొలిపిస్తానని చెప్పు. ఈ పాతికతీసుకో. ఇరవై దానికియ్యి. మొత్తం నువ్వు కొట్టెయ్యకు. డొక్క చీల్చేస్తా। ఏటిగట్టుపాకలోకి రమ్మను"

డబ్బుచేతిలో పడిందంటే చాలు. సుబ్బడు సరస్వతిని తార్చమంటే తార్చేరకం. అందుకనే వాడికి ఇంటిపేరులేకుండా పోయింది. తార్పుడు సుబ్బడంటే తూర్పుపేట నుండి తుమ్మక్క మేడదాక అదోరకం "ఇనుఫ్లెన్సు." తుమ్మక్క అంటే ఎవరోకాదు. తుంగభద్రయ్యగార్ని రోజూ మజాకాచేసే సింగారి. సింగారిమేడ నిజంగా మేడకాదు, దూళ్ళపాకలో సిమ్మెంటుగది. ఊళ్లోవాళ్ళంతా పెట్టిన "నిక్‌నేమ్" లాటిది అ తుమ్మక్క మేడ.

ఆ మేడలో వారానికొక కోడిని తింటారు తుంగభద్రయ్యగారు. కోడితోపాటు కోటయ్య తెచ్చిన నాటుసారా సేవిస్తారు— కాదు సేవించేవారు.

ఇక కోటయ్యచేత్తో సచ్చుమంచినీళ్ళుకూడా ముట్టరు, ఇంత గొడవ జరిగిన తర్వాత కోటయ్యకు తనకు సంధిపొసగటం అసంభవం. కోటయ్య కొంప ఖాళీచేయాల్సిందే. ఏదో కావేటి మొహం చూసి— ఛ—కాదు— దాని వొళ్ళుచూసి ఇన్నాళ్లు ఆగారు కాని లేపోతే వెధవని కోటయ్యని ఆరోజే వోటు హక్కులేకుండా వూరినుండి తరిఁవేసేవారు.

అసలింతకూ కావేటి ఎవరోకాదు. కోటయ్య పెళ్లాం. తార్పుల సుబ్బడు న్యాయంగా ఇస్తే ఇరవైరూపాయలు చేరవలసిన గమ్యం. క్లుప్తంగా చెప్పాలంటే భద్రయ్యగారికి చిరుతిండి. మామూలు పరిస్థితుల్లో అయితే నిజానికి తుంగభద్రయ్యగారు తార్పుడు సుబ్బడిచేత కావేటికి కబురు పంపక్కర్లేదు.

అలా— గరువుమీద గానుగెదులా పాకదగ్గర తడకవద్ద కొంచెంసేపు తచ్చాడితే చాలు. ఈలోపు కావేటి చెంబుతో తిన్నగా తప్పదన్నట్టుగా చెఱుకుతోటలోకి వెళ్తుంది

తుంగభద్రయ్యగారు మనుషులందరికీ పనులు పురమాయించి కొంచెంసేపటికి చెఱుకు తోటలోకి వెడతారు.

అంతే— మళ్లా ఈలోపు రకరకాల తిళ్లతిని ఎప్పుడో కావేటికి పునర్దర్శనం.

దాంతో కావేటికి ఒక అరబస్తా పిడకలో (అవీ కావేటి చేసినవే), అయిదు పదలాలు బెల్లమో, వాళ్లావిడకు తెలియకుండా అరజాడీ ఆవకాయో! అంతగా ఎప్పు డన్నా మరీ గోలపెడితే అయిదో పదో—

ఇవేవీ కావేటికి నిజంగా కూడెడుతున్నాయా అంటే— 'లేదు'— అని కావేటి ఖచ్చితంగా చెప్పగలదు. ఐతే మరి 'భద్రయ్య చేతిలో కావేటి కాలెందుకు జారింది' దానికి మొదట్లో కావేటికి అంతుదొరకలేదు కాని తర్వాత తర్వాత తెలిసిపోయింది.

అసలు కావేటేగనక విద్యావేత్తయితే "దారిద్ర్యానికి ధనంపైమోజు. థర్డ్‌క్లాస్ టిక్కెట్టుకు ఫస్ట్‌క్లాస్‌పైమోజు. సైకిలుకు కారుపైమోజు. కారుకు ప్లెయినుపైమోజు. పూరిగుడిసెకు ఆరంతస్తుల మేడపైమోజు— ఈ మోజే తనకాలు తుంగభద్రయ్య చేతిలో జారేటట్టు చేసిందని చెప్పి ఉండేది. కాని కావేటి చదువుకొన్నది కాదుగా—

కోటయ్య పెళ్ళాం.

"పాలేరు కోటయ్య పెళ్లాం"

ఈమాటే కావేటి మొగుడుదగ్గిర కొచ్చిన కొత్తలో ఊరందరి నోట్లోనూ పిప్పర మెంటులా చప్పరింపబడేది.

కావేటి కాణప్పగారి చెర్లోంచి నీరట్టుకొస్తుంటే కుర్రాళ్ళ దగ్గరనుంచి ముసలాళ్ల దాక కావేటిని కళ్ళతో తాగేసేవారు. కావేటి బిందె నెత్తిమీదపెట్టుకొని కుడిచేత్తో బిందట్టు కుంటే ఊరంతా రోడ్డుకు కుడిపక్కగా నడిచేది— ఎడంచేత్తో బిందట్టుకుంటే ఊరంతా రోడ్డుకు ఎడంపక్కగా నడిచేది. కావేటికున్న నాలుగుచీరల్లో ఏ చీరకట్టినా ఆ చీరకు అందం వచ్చేది. కొత్తగా కాలవలోకి నీరు పాకినట్టుగా కావేటి వొంపుసొంపులపై చీర అతుక్కుపోయేది. కోటయ్యమాత్రం కొత్తలో కాయకష్టం లోంచొచ్చిన చెవటబెట్టి చీరలు కొనేసేవాడు. అందుకనేనేమో, కావేటి చీరలంత బావుండేవి!

ఊళ్లో వాళ్ళలాగే కొత్తలో కావేటి శరీరాన్ని మాత్రమేచూసి మురిసిపోయేవాడు కోటయ్య. కానితర్వాత తర్వాత కావేటి రక్తమాంసాల వెనక ఏదో బంధంకనిపించేది.

అలాటి వయసులో ఉన్న కావేటి వయసులతో ఆడుకొనే తుంగభద్రయ్య చేతి లోంచి తప్పించుకోలేక పోయింది. తుంగభద్రియ్యకు వయసుమళ్లని రోజులవి. అప్పట్లో తుంగభద్రయ్య సరదాగా గుర్రాన్నొకదాన్ని కొన్నాడు. ఊళ్ళో నాలుగైదు సార్లు రోజూ షికారుకు తిరిగేవాడు. భద్రయ్య గుర్రానికి చాలపొగరనేవాళ్ళు ఊళ్ళో వాళ్లు— భద్రయ్య పెళ్లానిక్కూడ— భద్రియ్య భార్యమాటల్లో ఎంతోగర్వం తొణికిస లాడేది. నడకలో చాల ఠీవిచూపించేది. ఆవిడ ఠీవిగురించి ఊరంతా రకరకాలుగా చెప్పుకొనేవారు.

"నాకు ఠీవిగల ఆడదంటే మాచెడ్డకసి" అనేవాడు కోటయ్య. ఈ మాటిన్నప్పు డల్లా కావేటికి భద్రియ్య భార్యను చూడాలనిపించేది.

ఓసారి భద్రయ్యగారింట్లో ముసలమ్మ చచ్చిపోతే ఊళ్ళోవాళ్లందరికీ పప్పూ పులుసుతో సంతర్పణ పెట్టించాడు. ఆ సందర్భంలో ఏదోపనుందని పాలేరు పెళ్లాం కావేటికి భద్రియ్య పెళ్లాం కబురంపింది.

అప్పుడే కావేటి భద్రియ్య ఇంటిని, భద్రయ్య పెళ్లాన్నిచూసింది. పనిచేసుకునే వాళ్ళు చూడవలసినంత దూరాన్నుండే చూసింది. భద్రియ్య పెళ్లాంకంటే భద్రియ్య పెళ్లాం పెట్టుకున్న నగలు నచ్చాయికావేటికి— అసలాయింట్లో భద్రియ్యకంటె, భద్రయ్య పెళ్లాంకంటే ఆ ఇంటి పడగ్గది నచ్చింది.

"అమ్మగోరూ, ఒక్కసారి గది సూత్తానండి" అంది కావేటి ఉండబట్టలేక.

భద్రియ్య పెళ్లాం ముందు మొహం చిట్లించింది. "సరే, జాగ్రత్తగా చూడు. కాళ్ళుతుడుచుకు లోపలికెళ్ళు" అంది.

జాగర్త అనేపదం కావేటికి అనవసరం అనిపించింది. కాళ్లకడుక్కోని చీర కొంగుతో కాళ్ల తుడిచేసుకుంది.

కావేటి గుమ్మంలోపల అడుగెట్టిందో లేదో— పనిపిల్లకామోసు కాపలా కుక్కలా గుమ్మందగ్గర నిలబడి కావేటిని చూస్తోంది. కావేటి గదిలో వస్తువులపేర్లు ఒక్కొకటి అడిగింది.

గది సుమారు కావేటి ఉంటున్న దూళ్లపాకలో మూడోవొంతుంటుంది. పేద్ద బొమ్మిగేదెల్లా గదిలో రెండు మంచాలు. వాటిపై పులిచార్లతో ఉన్న వెడల్పాటి దుప్పట్లు,

మల్లెపూలాంటి దోమతెర ముసుగు. గదంతా పచ్చగడ్డి పరిచినట్టుగ పచ్చటికార్పెట్టు. దానిపై ఉమ్మెత్తపువ్వులాంటి పువ్వులు కార్పెట్‌పై నడుస్తుంటే కావేటికి కాళ్లలో చక్కిలిగింత పెట్టినట్టయింది. గదిచుట్టూ ఒట్టేళ్ళ చాపలూ, గదిలోకెళ్లగానే బొడ్డులోతు నీళ్ళలో దిగినంత చల్లగా ఉంది. గోడకి నాలుగుప్రక్కలా నాలుగు కుండేళ్లలా తెల్లటి అందమైనదీపాలు— వాటికి చమురెక్కడ పోస్తారా। అని కావేటి కళ్లపెద్దవిచేసి చూసింది.

పక్కకి తిరిగిచూసి ఒక్కసారి ఉలిక్కిపడింది. తనెత్తు అద్దం కావేటి సిగ్గుపడిపోయింది. బుగ్గలమీద చొట్టలుచూసుకొని పక్కకు తిరిగిపోయింది. పైనున్న శృంగార చిత్రిపటాలవేపు అలా చూస్తూండిపోయింది. అందులో కావేటికి పిల్లనగ్రోవి ఓచేత్తో పట్టుకొని రాధవీపు వెనకనుండి ఎడంచేతి క్రిందుగా రెండోచెయ్యి పోనిచ్చి నిల్చున్న కృష్ణుడు కనిపించేసరికి కావేటికి కోటయ్యగుర్తొచ్చి సిగ్గుపడిపోయింది. పనిపాపతో రేడియో పెట్టించుకొని కొంచెంసేపుంది. కావేటికి గదిలో ఉన్నంతసేపూ ఎక్కడో మంచుగుహలో ఉన్నట్టుంది. తనుంటున్న తడికల భవనం గుర్తొచ్చింది. తెగిపోయిన నులకమంచాలు కావేటిని వెక్కిరించినట్టయింది. కావేటి భద్రియ్య ఇంటిలో మంచాల వంక మరోసారి చూసింది. 'దీనిపైనే భద్రయ్య, భద్రయ్య పెళ్లాం పడుకుంటారు' అనుకుందో లేదో— తను, తనకోటయ్య ఆ మంచాలపై పడుకుంటే కావేటి ఆలోచించలేకపోయింది. ఆఖరుసారిగా గదిలో ముసుగుతో మూలనున్న ఇనప్పెట్టెవంక చూస్తూ బైటకువచ్చేసింది. అంతకంటే ఎక్కువసేపు అక్కడుంటే అమ్మగారిదగ్గరనుండి కేక వస్తుందని తెలుసు.

అంతే అదంతా కలలా జరిగిపోయింది. నిజంగా ఆరాత్రి కలొచ్చింది తనూ తుంగభద్రయ్య ఆ మంచంమీదున్నట్టు. కావేటి మరునాడు నీళ్లకెళ్ళేటప్పుడు తుంగభద్రయ్యను వింతగా చూసింది. ఏదో కొత్తగా కనిపించాడు. ఊళ్లోవాళ్ళంతా అంటారు "భద్రియ్య ఇల్లు చాలా బావుంటుందని" కావేటికి ముసుగు కప్పుకొన్న మంచాలు మళ్లీప్రత్యక్షమయాయి. వాటికి మనం తగం అనుకుంది. మరి తుంగభద్రయ్య దొంగచూపులేంవిటి?

తుంగభద్రియ్య తొడుక్కున్న సిల్కు చొక్కలోంచి కనిపిస్తోన్న నోట్లకట్టవంక చూసింది. భద్రియ్య కావేటికి ఆకలిలా కనిపించాడు. భద్రియ్య కౌగిట్లో తనుంటే భద్రయ్య పెళ్ళాంతో తనకు సమానహోదా లభించినట్టుగా పొంగిపోయింది. అంతే-

కావేటి కొలుజారింది తనింట్లోనే- తన నులకమంచంపైనే. కోటయ్య లేనప్పుడు భదిరియ్య కావేటిని మెత్తగా మత్తుగా నలిపాడు. కాని అతనిమంచంపై కాదు. అప్పుడు తెలిసింది కావేటికి- తను తుంగభదిరియ్య పెళ్లాంతో సమానం కానని. ఏదేమైతేం కావేటి మనసులో భద్రయ్యగది. భద్రయ్యగదిలో మంచాలు అలాగే ఉండిపోయాయి.

కావేటి భదిరియ్య మొహం వంకమళ్లా చాలకాలంవరకూ చూడలేదు. ఈలోపు అతను తుమ్మకర్ర ను తెచ్చిపెట్టుకొన్నాడు.

కావేటి తన తడికల మేడలోనే ప్రసవించింది. అప్పుడు మరోసారనుకుంది. తను భదిరియ్య పెళ్ళాన్నికానని- పాలేరు కోటయ్య పెళ్ళాన్నని. కోటయ్య అప్పటి వరకూ ఇంకా రక్తమాంసాలనే ప్రేమిస్తున్నాడు. కాని ఈకాన్పు తర్వాత ఆ రక్త మాంసాల వెనుకనున్న కావేటంటే విపరీతమైన అనురాగం చూపేవాడు.

కొడుక్కి భదిరియ్యగారిపేరు పెడతానన్నాడు. చిన్నప్పటినుండి వాళ్ళపనిలోనే చేశానన్నాడు. కావేటి ససేమిరా ఒప్పుకోలేదు.

అలాగయితే "నీపేరు పెట్టు" అని పంతంపట్టి కాఁవయ్య అని పెట్టించాడు. ఓరోజు కావేటి చాపమీద పడుకొని పిల్లాడికి పాలిస్తోంది. కోటయ్య కొడుకు పక్కనే పడుకొని కావేటిని చూస్తూ అన్నాడు.

"కాఁవీ, నువ్వు నాకోసఁవే పుట్టావుకదూ!"

"లేదు. నువ్వే నాకోసం పుట్టావు" కావేటి సమాధానం.

"పోనీలేయే మన బుడ్డోడికోసం మనిద్దరం పుట్టాం" అన్నాడు నవ్వుతూ కోటయ్య.

కావేటి చేత్తో జుట్టు సవరించుకొంటూ అంది.

"మాఁవా! మన కాఁవయ్యను చదివించాలి. ఇప్పట్నుంచీ కూడబెట్టాలి. వేణ్నీళ్లకు సన్నీళ్ళు సాయఁవంటారు. నేనుకూడ రేపట్నుంచి కూలికొస్తా"నంది. కోటయ్య కాలుస్తున్న బీడీ నేలకేసికొట్టి "ఛ! ఆయెదవల కళ్లన్నీ నీమీదేవుంటాయే. ఈల్లేదు" అన్నాడు.

కాని కావేటికి ఇంటిదగ్గర పనిలేకుండా ఉంటే ఏతుంగభద్రయ్య మంచాలో గుర్తొస్తాయని భయం. పైగా కొడుకుని చదివించాలి. అలాటిల్లు కట్టించాలి. ఏదేఁ

వైతేనేం. కోటయ్యను బలవంతానొప్పించేసింది. కోటయ్య చివరికొక షరతుకొప్పుకు న్నాడు ఆ షరతుప్రకారం 'కావేటి కొడుక్కి పాలిచ్చి నిద్రపోబెట్టి, తర్వాత కూలి కెళ్తుంది'.

కావేటి పదిరోజులు కూలికెళ్లింది. పదిరూపాయలు ముంతలోదాచింది. పదకొండో రోజు పిల్లోడిని చీరతోకట్టిన ఉయ్యాలలో పడుకోబెడదామనుకుంది. కాని చాపమీద నిద్రపోతున్న చిన్నకాటయ్యను కదపబుద్ధికాలేదు. తడికతలుపుదగ్గరేసి కూలికెళ్లింది.

తిరిగి వచ్చేసరికి చాపమీద పిల్లోడులేడు. గాలికి తడికతలుపు కదుల్తూ ఉంది. దూళ్లసాలంతా కంగారుగా తిరిగి ఉలవలదాలిదగ్గర కొచ్చింది. కెవ్వుమని అరిచింది. చుట్టుపక్కలవాళ్ళు పరుగెత్తుకొచ్చారు.

దాలిలోపడి మాడిపోయిన కొడుకునిచూసి కోటయ్య గుండెలవిసేటట్టు ఏడ్చాడు.

"అయినా పాకటం వొచ్చిన కుర్రాణ్ణి అలా పడుకోబెట్టిపోవటం వేంటిటి" అంది పక్కసాలలో పుల్లయ్య పెళ్లాం. మొత్తంమీద అంతా 'రామరామ' అన్నారు. కావేటీ కోటయ్యా బెంగతో నాలుగురోజులు సరిగ్గా కూడుతిన్లేదు. గుర్తుకొచ్చినప్పుడల్లా నోటిలో గుడ్డ కుక్కుకొని కుళ్ళికుళ్ళి ఏడ్చేవారు.

అదంతా ఓ కలలా జరిగిపోయింది. కోటయ్య కొడుకు చావునుగూర్చి అంతా మర్చిపోయారు.

"పోనీలేయే! మనకు మాత్రం వయసేం మీరిపోయింది? ఇక పిల్లలు పుట్టక పోతారా" అన్నాడు కోటయ్య పైకండువాతో కళ్లతుడుచుకొంటూ.

కాలం విచిత్రమైంది. ఎవరినీ ఎల్లకాలం ఏడుస్తూ కూర్చోనీయదు. అలాగే ఎవరినీ ఎల్లకాలం నవ్వనీయదు. కాని కావేటి జీవితంలో నవ్వుకంటె దుఃఖమేఎక్కువ ఒలకబోసింది. అలాగని కావేటి అప్పుడప్పుడూ నవ్వటం మానలేదు.

మళ్లా మామూలే,

తుంగభద్రయ్య అప్పుడప్పుడు చిరుతిండి తింటున్నాడు. అయితే కావేటికి తుంగభద్రయ్యమీద మోజువిోయింది. కాని యంత్రంలా ఎప్పటిపనులు అప్పుడు జరిగి పోతున్నాయి. కావేటిలో హుషారు చచ్చిపోయింది. లోకం అర్థమయింది. మళ్ళా

ప్రసవించింది. ఏకీభూ్యపనిచేయని ఓపిల్ల పుట్టింది. కాని తుంగభద్రయ్య కన్నీరుపెట్ట లేదు. కోటయ్య మాత్రం కుళ్ళికుళ్ళి ఏడ్చాడు. కావేటికి మరోసారి తెలిసింది తుంగ భద్రయ్య పట్టెమంచంకంటె కోటయ్యగుండె చాల విశాలమైనదని. కాలం గడుస్తోంది.

కావేటికి కొంచెం కొంచెం యవ్వనం నడుస్తోంది. కోటయ్య వొళ్లు ఇంకా గట్టిగానే ఉంది. తుంగ భద్రయ్య కమతంలో ముప్పైఏళ్లు సర్వీసు పూర్తయింది. ఉంటున్న పాక మారలేదు. కట్టుకొంటున్న గుడ్డ మారలేదు, "ప్రమోషను"మాత్రం రాకపోలేదు. అదే- పెద్ద పనిలోంచి అంటే పొలంపనిలోంచి తుమ్మక్క మేడలో దూళ్ళను చూసుకోవటంలోకి మారింది- ఆ నోరులేని జంతువులపై ఈ నోరులేని కోటయ్య అధికారి.

కోటయ్య ఓరోజు దూళ్ళకు చిట్టుపెట్టి ఆలోచిస్తూ చుట్ట నోట్లో పెట్టాడు. అగ్గి కోసం తిన్నగా తుమ్మక్క వంటచేసుకొనే పొయ్యిదగ్గరకు వెళ్లాడు. పొయ్యిలో చుట్ట పెట్టి వెలిగించాడు అంతలో తుమ్మక్క పెరట్లోంచి స్నానంచేసి తుండు చుట్టబెట్టు కొని వస్తోంది తుమ్మక్క కోటయ్య వంక అదోలా చూసింది. కోటయ్య పొగ వొదుల్తూ కీళ్ళులేని కూతురుగురించి ఆలోచిస్తున్నాడు తుమ్మక్క చీరకట్టుకుంటోంది. కోటయ్య చుట్ట గుప్పుకుంటూ వెళ్ళి వీధితలుపు తీశాడు.

ఎదురుగుండా తుంగ భద్రయ్య గుమ్మంలో చెప్పులిడుస్తున్నాడు. లోపల తుమ్మక్క చీరకట్టుకుంటోంది. "అక్కడ దూడలు ముట్టెలతో చిట్టుతగలేస్తుంటే ఇక్కడేం చేస్తున్నావ్" అన్నాడు రుసరుసలాడుతూ.

"ఎలిపోతనా బాబూ- చుట్టకాల్చుకొంటానికొచ్చా" అడుగు గుమ్మంబైటపెట్టాడు. కంగారులో తుంగ భద్రయ్య విడిచిన చెప్పులు తొక్కాడు.

"యెదవా ! కళ్లు కనిపించటంలేదా? ఏరా"- అంటూ మెడమీద చెయ్యేసి ఒక్క తోపుతోసాడు. కోటయ్య గుండె కలుక్కుమంది. ముప్పైఏళ్లగానుగెద్దును ముల్లుకర్రతో పొడిచినట్టయింది. ఆరోజునుండి తుంగభద్రయ్య ఏదోవంకమీద కోటయ్యపై విరుచుకు పడుతున్నాడు- గానుగెద్దుకు ఓపికపోతూంది. ఓరోజు గానుగెద్దును కొట్టటంకూడ జరిగింది. గానుగెద్దుకు ఓపికపోయింది. కంవతానికి లెక్కలు చూడమన్నాడు. ఇంకో కంవతంలో చేరతానన్నాడు.

"పోతే— పో— అయిదు బస్తాలు వాడుకున్నావ్ వాటికి నోటురాసిపో" అన్నాడు. ముప్పైఏళ్ళ సేవకుడు గనుక దయదలచి అప్పుడే కక్కమనలేదు ఆ అయిదుబస్తాలు. కోటయ్య ఎక్కడికి పోతాడు? ఆ అయిదు బస్తాలు నీకంవత్సరంలోనైనా ముందుగా తీసికొని తినకపోతే జీవితం జరగదు— పైగా ఈ కంవత్సరంలో తనకో ప్రత్యేకస్థానం వుంది. పలుగెక్కడో పారెక్కడో తాడెక్కడో— ఏది కావాలన్నా బయటవాళ్ల కోటయ్య దగ్గరకు రావాల్సిందే. ఇదే బావుందనుకున్నాడు. మర్నాడు మామూలుగా పనిలోకెళ్ళిపోయాడు.

ఈమధ్యన కోటయ్యకొక చిన్న 'ట్రాన్స్ఫర్' వచ్చింది. తుమ్మకక్క మేడనుంచి తుంగ భద్రియ్య కొడుకు కంట్రాక్టుపనిలోకి.

ఈ కంట్రాక్టు పనిలోకొచ్చిం తర్వాత కోటయ్య చాలా చిరాగ్గామారిపోయాడు. దానిక్కారణం తుంగ భద్రయ్య కొడుకు. అతనంటే కోటయ్యకు వొళ్లమంట— తను చిన్నప్పుడు వొంటిమీద మోసినప్పటికీ. కోటయ్య కోపానికి కారణం ముఖ్యంగా ఈమధ్య జరిగిన సంఘటన.

కావేటి ఓరోజు కాలవగట్టువెంబడి వస్తుంటే పెర్లిన్ చొక్కాలోంచి పదిరూపాయలు తీసిచూపించి కన్నుకొట్టాడట కావేటి తలొంచుకొని ఇంటికొచ్చి ఏడ్చింది. భద్రియ్య ఒకటి రెండుసార్లు కోటయ్యకిమ్మని డబ్బిస్తే కోటయ్యదాకా చేరలేదు. ఈమధ్యన భద్రియ్య కొడుకు గుఱ్ఱపు బండిమీద తిరుగుతున్నాడు. మొన్న ఆమధ్య ఊరి చివర అప్పలస్వామి చెల్లెల్ని బలవంతాన బండిలోవేసుకొని ఇంకో యిద్దరు కుర్రాళ్లతో పట్నానికి పోయాడట. ఎప్పుడూ కుర్రగేంగితో పేకలాడుతుంటాడు. ఈమధ్యన తాగుతున్నట్టుకూడా వినికిడి. భద్రియ్య కొంతకాకపోతే కొంతన్నా పని చేస్తాడు. అందుకే భద్రయ్య కొడుకంటే కోటయ్యకొళ్లు మంట.

కొడుక్కి పెళ్లవదేమోనని జడిసి సుపుత్రుడిపేర కాంట్రాక్టుచేస్తున్నాడు. అంతే. ఆ దెబ్బతో తుంగభద్రయ్య కొడుకు ప్రయోజకుడయ్యాడన్నారు. కనీసం ప్రయోజకుడిగా కొంచెం నటించమని తుంగభద్రయ్య పెళ్లాం కొడుకును వేడుకొంది. ఏదైతేనేం. దేవుడు వరమిచ్చాడు. తుంగభద్రియ్యకు రెండులక్షల రూపాయలతో కోడలుదిగింది. కోడలనుకుందో లేదో తెలీదుకాని కోడలు తలిదండ్రులనుకున్నారు.

"దానికేముంది— ఇవ్వాళ అల్లరిగా తిరిగినోళ్లు రేపు బాగుపడ్డంలేదా? కుర్రచేష్ట లెల్లకాలం ఉంటాయా— అయినా లక్ష్మి కళకళలాడుతున్న ఇంట్లోకి పిల్ల అడుగిడుతున్నప్పుడు తటిమ్మావనవసరం" ఈ నిర్ణయానికి రాకపోతే కూతురునెలా ఇస్తారు!

"డబ్బిచ్చి మొగుడ్ని కొనుక్కోవచ్చుగాని ప్రేమను కొనుక్కోలేం" అంటాయి తుంగభద్రియ్య కోడలి కొంగులో అరిన కన్నీళ్ళు.

ఏదైతేనేం, భద్రయ్య కొడుకంటే కోటయ్యకు పరమ అసహ్యం.

కంటాక్టుపనిలో రాళ్లు సర్దుతున్న కోటయ్యకు పిలుపువచ్చింది. అప్పుడప్పుడూ అలవాటులో ఉన్న కోటయ్య ఆరోజు కొంచెం అలవాటులోవున్నాడు. తూలిపడిపోయేటంత అలవాటులో మాత్రం లేడు.

చినదొరగారు పిలుస్తున్నారనేసరికి కోటయ్య చిరాగ్గావెళ్ళాడు. లోపల భద్రయ్య కొడుకొక్కడూ కూర్చొన్నాడు. లోపలేం జరిగిందో ఎవరికీతెలీదు.

కోటయ్య చింతనిప్పులు కక్కుతూ బయటకొచ్చాడు.

"నాయాలి కావాలిరా? నీయాలి...." అంటూ అరుస్తున్నాడు, అంతా పనులు మానేసి కోటయ్యచుట్టూ మూగారు. కోటయ్య పరిస్థితి కనిపెట్టి 'పోనీలే ఇంటికి పో' అంటున్నారు. ఇంతలో తుంగ భద్రియ్య వొచ్చాడు. లోపలికెళ్ళి గోబ తిరిగిపడ్డ కొడుకుని చూసాడు.

ఒళ్లు తెలియకుండా "ఆ యెదవని కట్టేయండి" అంటూ బైటకొచ్చాడు,

భద్రియ్య పెళ్ళాన్నీ, కోడల్నీ కలిపి బూతులు తిడుతున్న కోటయ్యని అక్కడ పక్కనున్న వొంతెనకు కట్టేశారు.

"పెద్దా సిన్నాలేదా— పాలోసి పెంచితే ఇషం అవుతావురా" అంటూ, కాలి బూటుతీసి కట్టేసిన కోటయ్యను ఒక్కటి కొట్టాడు. తిట్లు తిడుతున్న కోటయ్యదవడలో నాడాదిగింది. పళ్ళమ్మట రక్తంకారింది (అయినా పాలుతాగలేదుగా- విషం కారటానికి అందుకే రక్తం కారింది).

"భవిష్యత్తులో మీరెవ్వరూ క్రమశిక్షణ తప్పకూడదు" అన్నట్టుగా- ఒక్కసారి భద్రియ్య పాలేళ్లందరి పంకాచూసాడు.

తిరిగి కసి ఆగక బూటుతో కోటయ్య తలమీద కొట్టబోయాడు.

అంతే గానుగెద్దు రెండుకాళ్లు ఎగిరి భద్రయ్య గుండెల్ని తన్నినాయ్— తుంగ భద్రయ్య ఆ ఊపుకు వెనక్కి పడ్డాడు గబాగబా అయ్యగార్ని ఇద్దరు మనుషులు లేవదీసారు. మరో ఇద్దరు కోటయ్యను చెరోతన్నూ తన్నారు. కాళ్ళూచేతులూ విరగ దీసికట్టి రోడ్డుమీద పడేశారు.

కట్టేసిన కోటయ్యను కొట్టడానికి తుంగభద్రయ్య చేతిలో రెండు కడవిసీకర్రిలు విరిగిపోయాయి.

ఈ విషయం తెలిసి కావేటి లబోదిబోమంటూ పరుగెత్తుకొచ్చింది.

ఇంతలో భద్రయ్య కొడుకుతేరుకున్నాడు. బ్రతుకు వాఙ్మూలమిచ్చాడు. "కోటయ్యను ఇంటినుండి కాఫీ తెప్పించటానికి రమ్మన్నాను. పదిరూపాయ లడిగాడు— నిషాలో కావేటి దగ్గరకోసారెళ్ళమన్నాడు. కోపంవొచ్చి నేను చెయ్యచేసుకొన్నాను. దాంతో నన్ను లెంపమీదకొట్టాడు. కళ్లుతిరిగాయి. ఆ తర్వాత నాకుతెలీదు" అన్నాడు. ఈమాట చాలమందికి పైకి నచ్చింది. భద్రియ్య బంధువులు, ఊళ్ళో మిగతా పెద్దవాళ్ళంతా కోటయ్య తిరగబడటం మోతుబరు రైతులందరిపై తిరుగుబాటుగా భావించారు. తక్షణం ఊరు ఖాళీచేయాలని ఆర్డరు జారీచేశారు.

పని మనుషులకు పొగరెక్కిందన్నారు. ఇవ్వాళవాడు రేపొద్దుటింకొకడు. ఇలాగే అవుతుందన్నారు.

పాలేళ్ళ తరపున ఓపెద్దొచ్చి అయ్యలందర్నీ బ్రతిమాలుకొన్నాడు. "ఏదోపొరపాటయింది బాబూ! రేపు స్పృహరాగానే క్షమాపణ చెప్పుకుంటాడు" అన్నాడు.

క్షమాపణ చెప్పుకోటానికి కోటయ్య ఇంకా సరిగా మనుషుల్లోకి రావటంలేదు. వొచ్చినా మాట్లాడటంలేదు. ఏదో వెర్రిగా చూస్తాడు. కావేటి బలవంతాన పట్టిస్తే కాస్త గంజితాగుతాడు. జ్వరం ఉందోలేదో చెప్పటానికి కావేటి చేతులు తప్పితే డాక్టరు థర్మామీటరు లేదు. ఏదో కాషేటి మొత్తుకుంటే మొదటి రెండురోజులూ వచ్చిచూసి వెళ్లాడు. తర్వాత "అదే పోతుందిలే— ఫర్వాలేద"'ని ఊళ్ళో రిపోర్టిచ్చి పోయాడు.

పదిహేను రోజులు గడిచింది. ఈ సంఘటన పాతబడిపోయింది. కాని దూళ్ళ పాకలో అప్పుడే ఎలా పాతబడుతుంది. కోటయ్య మూలుగులు తగ్గాలి. కోటయ్య

జ్వరం తగ్గాలి— అప్పుడేవన్నా పాతపడుతుందేమో। అయినా ఇంత గొడవ జరిగిన తర్వాత తుంగభద్రయ్య కావేటి పాకకెందుకొస్తాడు।

అందుకనే తార్పుడు సుబ్బడిచేత కవురంపించాడు. ఎప్పుడూ ఇవ్వనిది ఈసారి ఇరవై రూపాయలు కూడ ఇచ్చి పంపించాడు.

"ఎలా ఉన్నాడే ఈడు" అంటూ వచ్చాడు సుబ్బడు డబ్బుతో. కీళ్లలేనిపిల్ల వెర్రిగా చూస్తోంది. కోటయ్య మూలుగుతున్నాడు. కావేటి దూరంగా గోడకి జారగిలబడి శూన్యంలోకి చూస్తోంది.

సుబ్బడు లోపలికెళ్లి కోటయ్య నుదుటిమీదచెయ్యిపెట్టి పలకరించాడు. మూలుగు సమాధానం.

"ఇయ్యేల మనలో లేనట్టున్నాడు" అంటూ పెదవి విరిచాడు. కావేటి శూన్యంలోంచి కదల్లేదు.

"అయినా ఈ యెదవ అదేంపనేహ్— ఆ పెద్దోళ్ళతో మనకెందుకు సెప్పు— అయినామతిమండమడ— మరిసిపోయానే. అయ్యగారు మందులకని పదియేనిచ్చారు" డబ్బందివ్వబోయాడు.

కావేటిలో చలనంలేదు. "అయ్యిన దానికేద్చేం సుఖంసెప్పు, బాదపడక" అంటూ పదిరూపాయల కాగితంలో ఐదురూపాయలుపెట్టి గడపమీదపెట్టాడు. కావేటి వాటిని చూడటంలేదు.

"అయ్యాగారక్కడ పాకదగ్గరున్నారు. ఏఁవైనా నువ్వు కనిపిత్తే మందులేఁవైనా ఇత్తారు" తార్పుడు సుబ్బగు చెప్పుకుపోతున్నాడు

కావేటి నిర్లిప్తతగా కూర్చుంది.

సుబ్బడు కొంచెం జంకాడు. "నిన్నక్కడికి తప్పకుండ రమ్మన్నాడు దొర. తర్వాత నీయిట్టం" అని మెమ్మదిగా గొణుక్కుంటూ పోయాడు.

కావేటి పాకలోకి వెళ్ళింది. తుంగభద్రయ్య కెదురుగా ఏదోశవం నిలబడినట్లుఉంది. ఉలిక్కిపడిచూశాడు. కావేటి— గుడ్లప్పగించి చూస్తోంది. రెప్పవాల్చటంలేదు.

"ఇలా అవుతుందని అనుకోలేదు" అంటూ ఏదో చెప్పబోతూ కావేటి వంక చూశాడు చలనంలేదు. అలాగే చూస్తోంది. కొయ్యబొమ్మలాగ. శ్వాసపీలుస్తున్నట్టు

కూడ అనిపించటంలేదు. భద్రియ్యకు ముచ్చెమటలు పోశాయి. కొంచెం కదిపి చూశాడు. కాని కావేటి చూపులు శూన్యంలోంచి కదల్లేదు. మెల్లిగా పాకలోంచి జారుకున్నాడు.

ఇది జరిగి ఇరవైరోజులయింది. ఈలోపు ఊళ్లో పెద్దమార్పులేఁవీఁ లేవుగాని కరణంగారి మరణజాబితాలో కోటయ్యపేరు చేరింది. ఊళ్ళో కుర్రాళ్ళు ఆడుకుంటాని కొక పిచ్చిది దొరికింది.

పాపం !— కావేటి- పిచ్చిముండ— అని ముత్తైదువులు ముద్దలేస్తారు. వాటిని కావేటి పక్కనున్న కుక్కకు పారేస్తుంది. ఆ కుక్క తింటుంటే మెతుకులేరుకు తింటుంది. అంచేతే ఆ కుక్కెప్పుడూ ఊరంతా తనతోపాటు తిరుగుతుంది. లోతుకుపోయిన కళ్ళవంక ఎవరన్నాచూస్తే గట్టిగా ఓ అరుపులాటి నవ్వు నవ్వుతుంది.

ఎవరైనా ఏపాతచీరన్నా ఇస్తే పుచ్చుకోదు. తన చీరెలో ఓ కొంచెం ముక్కచింపి ఎదురిస్తుంది.

రాత్రి పన్నెండు, ఒంటిగంటకు ఊరి చివరి తాడిచెట్లదగ్గరికెళ్ళి "మాఁవో ! మాఁవో !" అని శూనిరాగాలు తీస్తుంది.

నవ్వుతుంది, ఏడుస్తుంది. నవ్వుతూ ఏడుస్తూ పిల్లల్ని నవ్విస్తుంది. పిల్లలు మొరమొరాలుపెడితే తింటుంది. కణికముక్కలు కొరికి ఊస్తుంది. జుట్టు పీక్కుంటుంది— ఇవేవీచేసినా చేయకపోయినా భద్రియ్య ఇంటిముందు వాటేసుక్కూర్చుంటుంది— ఎవ్వరూ లోపలికెళ్లనివ్వరు. ఎవళ్ళన్నా పెద్దవాళ్ళు అరుగుమీద కూర్చుంటే వాళ్ళ ముందు ఉపన్యాసమిస్తుంది. డబ్బులడుగుతుంది. ఇస్తే మొహాన్నేసి కొడుతుంది.

ఓరోజు తుంగభద్రయ్య అరుగుమీద వీధిగుమ్మం దగ్గరెవ్వరూలేరు. మధ్యాన్నం ఒంటిగంటయింది. భద్రయ్య కొడుకు భద్రయ్యగదిలో మంచంమీద నిద్రపోతున్నాడు తిన్నగా- పిచ్చిది లోపలికెళ్ళింది. భద్రయ్య కొడుకుపక్కని పడుకుంది. వికటంగా నవ్వుతూ, గట్టిగా అరవటం మొదలెట్టింది.

"అహ్హహ్హ— నేను భద్రయ్యపెళ్లాన్ని నేను భద్రయ్యకోడల్ని" ఈ అరుపుకు భద్రియ్య కొడుకులేచాడు.

ఆడామగా అంతా పరుగెత్తుకొచ్చారు.

పిచ్చిది ! పిచ్చిది ! కేకలు- పిచ్చిది.

భద్రయ్య కొడుకుమీద పడింది. జుట్టుపీకేసింది. బుగ్గ రక్తంవచ్చేటట్టు గట్టిగా కొరికింది. ఒళ్లు అందినచోటల్లా కొట్టుపెట్టింది. "అహ్హహ్హ ! నేను భద్రయ్యపెళ్లాన్ని. నేను భద్రయ్యకోడల్ని. ఈ మంచాలు నావి. ఈ ఇల్లునాది–' అరుపులు. "పిచ్చిది పిచ్చిది" ఈ గందరగోళంలో పిచ్చిదానికూడా వచ్చిన కుక్క వీధిలోకి జారుకుంది- హోలోహోలోమని కేకలు.

నలుగురు మనుషులు పిచ్చిదాన్ని మంచంమీద నుంచి లాగబోయారు. మంచం మూల గట్టిగా పట్టుకుంది, అది విరిగింది. బలవంతాన తీసుకొచ్చి వీధిలో గిరాటేశారు. "అమ్మో !" అంది.

అంతా తలోమాట అంటున్నారు. "ఇన్నాళ్లూ ఏదో పిచ్చిది, దానిమానాన్న అది బతుకుతుందనుకున్నాం" "కాని ఇలాటి దౌర్జన్యాలైతే ప్రమాదంవే. ఊళ్ళోవా ళ్ళెవరూ కాపరాలుచేసుకో అక్కర్లేదు".

ఇంతలో తేరుకున్న భద్రయ్య కొడుకు లోపలనుంచి తారాజువ్వలా దూసుకొచ్చాడు. జువ్వకర్ర తీసికొచ్చి ఎండి అట్టకట్టిన పిచ్చిదాని నెత్తిమీద ఒక్కవేటు వేశాడు. తలరెండుగా విచ్చింది. ఒళ్లంతా కుంకుమరంగు జల్లింది. రెండుచెవులమీంచి కండకండలుగా, హృదయం ఉన్నాళ్లని కరిగించేదిగా ఏదో ఎర్రగా పడుతోంది

అంతలో అంతా భద్రయ్యకొడుకుని పట్టుకొని చెడామడాతిట్టటం మొదలెట్టారు.

"పిచ్చిముండ, దానికేంతెలుసు" నన్నొకతను, కొంచెం తెగించి "నువ్వూ నీబాబూచేసిన నిర్వాకమే" నని ఇంకొకతను. సూటిపోటుగా పొడుస్తున్నారు.

మెలికలు తిరిగి నేలనుకూలిన కావేటి దాహం అన్నట్టుగా నోరుదాచింది. ఎదురుగా నిలబడ్డ ఒక చిన్నబాబువంక అలా చూస్తోంది– తలలోంచి రక్తం కావేటిని వొదులుతోంది– అంతలో ఎవరో ఒక తప్పాలాతో నీళ్లపట్టుకొచ్చి ఆబాబు చేతికిచ్చి పొయ్యమన్నారు. ఆబాబు, నోటిమీద అలా నీళ్లపోస్తున్నాడు. కావేటి రక్తంలోంచి అలా చూస్తోంది. రక్తం నీటితోకలసి అలా రోడ్డుపైసాగుతోంది.

# ఆంధ్రప్రదేశ్‌లో బలహీనవర్గాల ప్రజలకు

## ఆశాకిరణం .. నూతన అవకాశం ..

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బలహీనవర్గాల శ్రేయస్సుకు చేసిన సహాయక పనులు:

**భూములు లేనివారికి భూములు :—** శీఘ్రతర కార్యక్రమం చేపట్టిన ఫలితంగా గత సంవత్సరంలో పదిలక్షల ఎకరాలు పంపిణీచేయబడినాయి.

**ముందడుగు :—** సత్వరంగా గిరిజనుల అభివృద్ధిని సాధించే సంకల్పంతో ప్రణాళికా కేటాయింపులు ౧౦ రెట్లు హెచ్చింపబడినాయి. షెడ్యూలు ప్రాంతాలలో ప్రజలకు రక్షణనిచ్చే శాసనాలు తయారు చేయబడినాయి. ఋణవిముక్తిని కలిగించే శాసనాలు తయారు చేయబడినాయి. హరిజనుల సంక్షేమం కొరకై తలపెట్టిన పథకములకు ప్రణాళికలో అయిదు రెట్లు ఎక్కువగా కేటాయించడం జరిగింది

**బృహత్తర ప్రణాళిక :—** షెడ్యూలు ప్రాంతాల ఆర్థికాభివృద్ధికొరకు రు. ౧.౫ కోట్లు ఖర్చుకాగల పథకం చేపట్టబడింది.

**ఇండ్లు లేనివారికి యిండ్లు :—** షెడ్యూలు తరగతులు, గిరిజనులు యితర వెనుకబడిన తరగతులకు చెందిన సుమారు ౨౦,౦౦౦ కుటుంబాలకు గృహనిర్మాణ కార్యక్రమం అమలు పరిచే నిమిత్తం రాష్ట్రప్రభుత్వం రు. ౧౨ కోట్లు ఖర్చుగాగల పథకాన్ని అమలు జరుపుతున్నది.

అంతేకాదు. దళితవర్గాల సంక్షేమం కొరకై యింకా అనేక చర్యలు తీసుకొనడానికి ప్రభుత్వం సంకల్పిస్తున్నది.

# డాక్టర్ ఎం. వి. రమణారెడ్డి

## 1947 ఆగస్టు 15

23 సంవత్సరాల క్రితం సరిగ్గా ఇదే రోజున భారతజాతి పెద్దగా మోసపోయింది. ఆ దెబ్బనుండి ఇప్పటికింకా కోలుకోలేదు. దారినపోయేవాడు చేసిన దగాకాదు. ఇంటివాడు చేసిందే! 'మనకు స్వాతంత్ర్యం వచ్చిం'దన్నారు. మువ్వన్నెల జెండా దారిద్ర్యాన్ని తుడిచేస్తుందన్నారు. 'నాదీ స్వతంత్ర దేశం, నాదీ స్వతంత్రజాతి' అని గర్వంతో ఉప్పొంగిపోయింది ప్రజ. ఆ పొంగులో 'కప్పంగట్టేది స్వాతంత్ర్యమే గాదు' అనే అరుపులు వినబడలేదు. రాను రాను రాజధాని హడావుడితప్ప, స్వాతంత్ర్యదినం మీద భ్రమ తొలగిపోయింది ప్రజలకు. చాక్లెట్లకోసం పోయే పిల్లలకు విధిగా జండాకొనవలసిన బాధ ఎక్కువైంది. కొని తెచ్చుకుందామన్నా ఉత్సాహం ధర పెరిగింది.

నిర్బంధంగా ఇది 'స్వాతంత్ర్యం' అనిపిస్తే తప్ప మనకున్నదాన్ని స్వాతంత్ర్య మనడానికి వీలులేదు. తెల్లదొరపోయి నల్లదొరలొచ్చారు. 'బ్రిటిష్‌వారు పోయినా బ్రిటిష్ పరిపాలన పోలేద'ని గాంధి అన్నాడు కాబట్టి సరిపోయిందికాని, ఇంకెవడన్నా అంటే ఈపాటికి దేశద్రోహి ఐవుండేవాడు. బలప్రయోగంతో స్వాతంత్ర్యం సంపాదించుకున్నవారు శాంతితో రాజ్యం చేస్తూంటే మనం శాంతితో సంపాదించి (?) బలప్రయోగంతో కొనసాగిస్తున్నాం. దేశాన్ని రక్తంతో తడిపి ప్రపంచానికి శాంతి పావురా లెగరేస్తున్నాము. బ్రిటీషు హయాములోకంటే మన హయాములోనే ఎక్కువ మంది ప్రజలను తుపాకులకు గురిచేసినట్లు రికార్డుందిమరి!

23 సంవత్సరాల స్వపరిపాలన భారత ప్రజలకు తెచ్చిందేమిటి? దారిద్ర్యం, నిరుద్యోగం, అవినీతి. తలసరి ఆదాయం కరెన్సీరూపంలో పెరిగినా, దానికంటె బలంగా, వేపుగా పెరుగుతున్న ధరలముందు ఏ ఉపయోగం లేకుండాపోయింది. విదేశాలకివ్వవలసిన అప్పు, వడ్డీతోసహా ప్రతి పౌరునిపైనా పడుతూంది. ఆ అప్పు సామాన్యునికి ఏరూపంలోనూ పైసాగూడా ముట్టకపోయినా, తీర్చుకునే బాధ్యతమాత్రం నెత్తిన పడింది. రెక్కలు ముక్కల య్యేట్లు కష్టపడినా కార్మికుని డొక్కనిండటం లేదు. కొత్తబట్ట కొనాలంటే రైతుకు అప్పుజేయక తప్పడంలేదు. విపరీతంగా ఖర్చుపెట్టి కొనుక్కున్న విద్యతో ఉద్యోగంకోసం ఎండమావుల వెంటపడక గత్యంతరంలేదు.

అన్నిస్థాయిల్లోనూ అవినీతివేర్లుప్రాకి సామాన్యుని భవిష్యత్తును బీటలువార్చింది. ఉద్యోగులు నిజాయితీగా బ్రతుకుదామంటే జీతం చాలదు. చిన్నతరగతి ఉద్యోగులు బ్రతకాలంటే లంచం పట్టితీరాలి. దాంతో లంచం ఇవ్వగల తాహతున్నవాడికే పనులు జరిగేది. ఆ ఇవ్వటంలో మళ్ళీ పోటీలు, ఎంత ఎక్కువ ఇవ్వగలిగితే అంత త్వరగా పని? లంచం చట్టవిరుద్ధమే కాని అమలుపరిచేదెవడు. అమలు పరిచేవాడు గూడా లంచగొండే అయినప్పుడు? ఉద్యోగాలు తమ హక్కులకోసం, తమ జీవితం మెరుగు పరుచుకోవటంకోసం, తమ పిల్లల భవిష్యత్తుకోసం ప్రభుత్వంతో పోరాడటానికి అన్నీ సంశయాలే, అన్నీ భయాలే. సంఘంకోసం పాటుపడటానికి ఉద్యోగం పోతుందేమో నని భయపడే ఉద్యోగి, నిర్భయంగా నిత్యం లంచం తీసుకొని చట్టాన్ని ధిక్కరిస్తున్నా డంటే ఈ దేశంలో అవినీతికున్న పలుకుబడి అమోఘం. మంచిమార్గంలో కంటే చెడుమార్గంలో పయనించడం తేలిక! మళ్ళీ అన్నీ శ్రీరంగనీతులే; ఎవరో చట్టాన్ని ధిక్కరించాలన్నారని గావుకేకలు.

అర్థంగాని లేబర్ చట్టాలతో, సందు దొరికితే మోసంజేసే యజమానులతో, డబ్బుంటే తప్ప అందని న్యాయస్థానాలతో కుళ్ళిపోతున్నాడు కార్మికుడు, ఈ దేశంలో అందరికీ ఒకటే న్యాయం. కాని, న్యాయం కొరకు ఫీజు చెల్లించాలి, మనకోసం ఇంకొకనోటిని డబ్బిచ్చి అరువు తెచ్చుకోవాలి, ఆ శక్తున్నవాడికే న్యాయం దక్కేది. లేనివాడిగతి విచారించే న్యాయంలేదు. న్యాయస్థానంలేదు. సామాన్యునికి అందదేమో గాని చట్టంమటుకు అందరికీ ఒకటే. షావుకారికి అదే బీదవానికి అదే.

నదీజలాలు సముద్రంలో గలిసినా ఫరవాలేదుగాని భూములకు మాత్రం పారకూ డదు. అన్నో యిన్నోపారితే వాటికోసం సవాలక్షతగాదాలు నాకుపారాలనికాదు; నీకు పారకూడదని, తిండిగింజలు దిగుమతి చేసుకోవచ్చుగాని, దేశంలో మాత్రం పండ గూడదు. మనంగూడా పండిస్తే అమెరికానుండి కొనేదెవడు? ఏదో ఒకటి కొంటూండక పోతే పరపతిచ్చేదెవడు? సుజలాం, సుఫలాం ఇప్పుడు కరువుకాటకం అయింది. అది ఈదేశం తప్పుగాదు, రైతులకు చేతగాకకాదు. పండించే అవకాశం ఇవ్వక, రైతుల పేరుజెప్పి ఎరువులు అమ్ముకొనే నాయకులు దేశాన్ని సుభిక్షం కానిస్తారా?

వీధి వీధిన వ్యభిచారగృహాల సంఖ్య పెరుగుతూంది. కడుపుకోసం స్త్రీ తన మానాన్ని అమ్ముతూంటే ఈ పవిత్ర భారతదేశంలోని పురుషులు చీకటి పడిందాకనైన నిలువకుండా బేరాలు సాగిస్తున్నారు. అందరూ అవినీతి ప్రబలుతూందని వాపోయే

వారే? చట్టాన్ని పెంటకుప్పపై విసిరేసి వచ్చి బాలెంతలనుగూడా వదలకుండా అనుభ వించి, ఎవరో చట్టాన్ని ధిక్కరిస్తున్నారని ఉపన్యాసాలిచ్చేవారే?

దొంగనోట్లు ముద్రించే ముఠాలు. మార్పిడిచేసే బాబాలు ప్రజలకు నీతులుచెప్పే హోదాల్లో చలామణి ఔతున్నారు. పగటి బజార్లకంటె చీకటిబజార్లు పచ్చగా పెరుగు తున్నాయ్. కల్తీలేని సరుకు కనిపిస్తే పాపం. 'మేడ్ ఇన్ ఇండియా' అంటే ప్రతి వానికి చౌక. స్మగుల్డ్ సామానుకున్న గిరాకి స్వదేశ వస్తువుకులేదు. పండ్లపొడి మొదలు ప్లిమౌత్ కార్లవరకూ అంతా ఫారీనే! 'ఇండియాదా' అని ఎగతాళిచేసే వాళ్ళంతా దేశభక్తులేమరి. ఎవరో పరాయిదేశాలకు ఏజంట్లని కళ్ళెఱ్ఱజేస్తారుగాని వారి నడతలు వారు గమనించరు.

ప్రభుత్వాన్ని మోసంజేయని వ్యాపారస్తుడులేడు. మోసం చేయంది వ్యాపారమే కాదు. మధ్యతరగతి వ్యాపారానికి మార్పిడిలో వచ్చిందే ఆదాయం. మార్పిడివల్ల వచ్చే స్వల్పలాభంతో గడుపలేరు కాబట్టి ప్రభుత్వాన్ని మోసంజేయడం తప్పనిసరి. కుదిరితే లంచాలమేత. కుదరకపోతే దివాలాఫారం. కాని, బహిరంగంగా పన్నులు ఎగ్గొట్టి ప్రభుత్వాన్ని లెక్కజేయకుండా కూర్చున్న బడా బూర్జువాలున్నారు. ప్రభుత్వం, దాని బలగం మధ్యతరగతి వ్యాపారులపైబడి పీడించవలసిందేగాని, వారిజోలికిపోదు. ఎందు కంటే, వారు పెద్ద దేశభక్తులు గనుక! దేశంలో సంపదనంతా జాగ్రత్తగా వీరు దాస్తు న్నారు గనుక.

ప్రొఫెషనల్ కోర్సులకుగూడా ఉద్యోగం చూపించలేని అసమర్థత ఇంకేదేశంలో కనిపించదు. ప్రతి విద్యార్థిపైన వేలరూపాయలు ఖర్చుచేసి వారిసేవను దేశం పొంద లేకపోబట్టే దరిద్రం అమలు కొచ్చింది. నిరుద్యోగులు నాయకుల పాదపూజలకే సిద్ధమౌతున్నారుగాని ఈ పరిణామాలను అరికట్టే ప్రయత్నానికి పూనుకోవటం లేదు. రాజధానుల చుట్టూ తిరిగి తిరిగి అరిపోతున్నారేగాని ఉజ్వల భవిష్యత్తును నిర్మించుకో జూడటంలేదు.

మనకంటె ఆలస్యంగా స్వాతంత్ర్యం తెచ్చుకున్న దేశాలు మనతో పోల్చుకు న్నప్పుడు అన్నిరంగాల్లో కొన్నివందలరెట్లు అభివృద్ధి చెందుతున్నప్పుడు మనమెందు కింత వెనుకబడివున్నాం? కరుడుగట్టిన ఖర్మసిద్ధాంతం తెప్పలుగాతేలుతున్న పిరికితనం, సాంప్రదాయంగా దిగబడుతున్న మానసిక బానిసత్వం జాతిని నిర్వీర్యంచేసి దేశాన్ని మురికి కూపంగా మార్చుతున్నాయ్.

ఎటుచూసినా అంధకారం నిండుకొన్న ఈ దేశానికి భవిష్యత్తేమిటి? దారిద్ర్యం ఊబిలో కూరుకుపోతున్న సామాన్యుని గతి ఏమిటి? ఈ దేశంలో యువతరం మేలుకోవాలి ఈ అంధకారం పటాపంచలై ఈ దేశంలో వెలుగులు విరజిమ్మాలంటే నివురు గప్పిన యువత చైతన్యజ్వాలలతో ఆకాశాని కెగబడాలి. నిదురబోతున్న ప్రజా సింహాన్ని జూలుబట్టి లేపాలి. నల్లమందుగా పనిజేస్తున్న ఖర్మసిద్ధాంతాన్ని వెంటబడి సరిహద్దులు దాటించాలి. అధికార కేంద్రీకరణ అంతమొందించాలి. ధన స్వామికానికి ముండమోయించాలి. సామాన్యుని ఆవేశం అడ్డుత్రోవల పడకుండా గమ్యంవైపు మళ్ళించాలి. సమాన హక్కులతో, స్వాతంత్ర్యంతో, శాంతి సౌభాగ్యములతో ప్రజలందరు వర్ధిల్లే మరోప్రపంచాన్ని సృష్టించటానికి యువకులు ధైర్యంతో త్యాగంతో ముందుకు నడవాలి?

## సూర్యగ్రహణం

### విప్లవ రచయితల అరెస్టుల ముందూ వెనకా

కె. వి. రమణారెడ్డి

మనస్సులూ వచస్సులూ అయిన రచయితల భావ స్వాతంత్ర్యానికి ఎక్కడ మన్ననలేదో, అక్కడ మొలిచే పూరికూడా ఎండి రాలిపోతుంది. అది వల్లకాడుగా మారుతుంది. రచయితల మనస్సులమీద బోర్లించే మూకుళ్ల నియంతృత్వం కిందనే తయారౌతాయి. సిగ్గూ, శరమూ వదిలేస్తేతప్ప, 'ప్రజాతంత్ర' మనేది నియంతృత్వం కాదు. మన పాలకవర్గం ఆ బాటను పడుతున్నందుకు రచయితలేకాదు, పౌరులంతా విచారించక తప్పని సమయం ఆసన్నమైంది

రెండు శతాబ్దాల బ్రిటిష్ పాలనలోగూడా జరగని ఘోరం ఇప్పుడు జరిగింది నేరుగా రాజకీయాలలో పాల్గొంటేనే తప్ప, ఆ పరాయి పాలకులైనా రచయితలను జైళ్ళలో కుక్కలేదు. అనుమానం మీద, ఆధారాలు ఏవీ ఇంకా చూపని ఆరోపణలను మాత్రమే పురస్కరించుకొని, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు, యం. వి. రమణారెడ్డిగార్లను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జైల్లో కుక్కింది. రహస్య రాజకీయ పార్టీలతో వారికేదో సంబంధం ఉన్నట్టు, ఆయుధాలుకూడా వారు చేరవేస్తున్నట్టు,

మంత్రిగారు శాసనమండలిలో ఆరోపించి ఉన్నారు. ఇది ఎంతవరకు నిజమో ఎవరికీ తెలియదు. నిజమనేది ఎవడి చెప్పుచేతల్లోనైనా రూపాన్ని మార్చుకోగలదు. నిజం వేరు. వాస్తవం వేరు. వాస్తవానికి విప్లవ రచయితల సంఘానికి ప్రత్యక్ష రాజకీయ కార్యాచరణతో సంబంధంలేదని మా ప్రణాళికలో వాచ్యంగా చెప్పి ఉన్నాము. మాది సాహిత్యమే ఏకైక వ్యాపకమైన రచయితల సంస్థగా రూపొందించ బూనాము. రాజకీయపార్టీల మెలికలనూ మలుపులనూ అనుసరించడం తగదని భావించాము.

ఇలా చెప్పినంతమాత్రాన, రాజకీయాన్ని మేము నిరాకరిస్తున్నామనిగానీ తృణీకరిస్తున్నామనిగానీ అర్థంకాదు. మార్క్సియన్ సోషలిస్టు సమాజ స్థాపనతోబాటు, అనేక రూపాలు ధరించక తప్పని ప్రజాపోరాట మార్గాన్ని మేము సమర్థిస్తున్నాము. ఆ సమర్థనకూడా సాహిత్యపరమైనదేగాని రాజకీయపరమైనది కాదు. అంటే, చైతన్యం గల రచయితలుగా మేము నిబద్ధులం ( committed ) అన్నమాట. ఇందులో దాచుకోవలసిందిగానీ సిగ్గుపడవలసిందిగానీ ఏమీలేదు సరిగదా, గర్వించదగిందే హెచ్చు.

నిబద్ధ రచయితలుగా మేము సాహిత్యాన్ని ప్రజాహృదయానికి చేరవేసి, వారి పోరాటపటిమ సడలిపోనివిధంగా శ్రామికజన చైతన్యానికి పదనుపెట్టదలచి ఆవిధంగానే రచనలు చేస్తున్నాము. శ్రామికవర్గానికీ ప్రభుత్వానికీ మధ్యవైరుధ్యం ఉంటే దాన్ని మేము కల్పించలేదు. ప్రజలు పోరాడక తప్పని పరిస్థితి ఏర్పడిఉంటే, దానికి మేము బాధ్యులముకాము. పేదరికానికీ, దానికి కారణమైన ఆర్థిక పీడనకూ మా పూచీ ఏమీ లేదు. ఈ విరుద్ధవర్గాల సంఘర్షణ సాయుధరూపం ధరిస్తే దానికి మమ్మల్ని నెపంగా చూపేపనిలేదు. సమాజం రచయితల చెప్పుచేతల్లో లేదు, సమాజం చెప్పుచేతల్లో రచయితలుకూడా ఉండక తప్పదు. మేము మా ప్రజలకు అండగా వారిగుండెకండగా నిలవదలిచాము. ఎందుకంటే, వాళ్ళు అసహాయులు. అభాగ్యులు. పీడితులు. రక్షణలేనివాళ్లు. కుబేరుడి వీపుతోమడం మావల్లకాదు. కుచేలుడి వెన్నువిరిచే పనిలో ఎవరికీ మా సహాయ సానుభూతులుండవు. భూస్వాముల కొమ్ములనూ ధనాఢ్యుల కోరలనూ మేము కీర్తించము. అసమానతలతో నిండిన ప్రస్తుత సాంఘిక వ్యవస్థను మేము సమర్థించము. ముళ్ళపొదల ఈ అడవిని తొలగించి దానిస్థానంలో ఉద్యాన వనాన్ని అవతరింపజెయ్యడమే మా లక్ష్యం.

ఉన్నవారికి ఊడిగంచేసే రాజ్యంలో తప్ప, ఇది అపరాధమనిపించుకోదు. ప్రజాతంత్రంగా వ్యవహరించే రాజ్యాంగంలో జరుగుతూన్న, అక్రమాలు చూస్తూంటే,

ప్రజాతంత్రమనేది కపట నాటకమని, వర్గనియంతృత్వమనే విషగుళికకు పూసిన పంచదార పూత మాత్రమేనని గ్రహించకతప్పడంలేదు. లేకుంటే ఈ కక్షలేమిటి, ఈ శిక్షలేమిటి, ఈ హింసలేమిటి, ఏమిటి ఈ ఘోరమైన అన్యాయం? ఇలాప్రశ్నించే నాడు ప్రపంచంలో బతకదలిస్తే మూగజీవంగానో జీవచ్ఛవంగానో బతకాల్సిన పరిస్థితి ఏర్పడుతూంది. ఇది ఏరాజ్యానికైనా ప్రతిష్ఠాకరమైన విషయంకాదు, ప్రజాతంత్రానికి మరీని.

విప్లవ రచయితల సంఘం ఏర్పడి ఒక్క సంవత్సరమే గడచింది. ఈ పన్నెండు నెలల కాలంలోనూ మేము పన్నెండేళ్లకు చాలినంత బాధను అనుభవించవలసివచ్చింది. మాకావ్య సంకలనం 'ఝంఝ'ను నిషేధించారు. మా ఉత్తర ప్రత్యుత్తరాలను కత్తిరించి చూచి మరీ అందజేస్తున్నారు. మా ముఖ్యసభ్యుల ఇళ్ళమీద దాడిచేసి పుస్తకాలనూ పత్రాలనూ తీసికొనిపోయారు. మా కార్యవర్గ సభ్యుడైన పి. కిషన్‌రావుగారిని ఆయన కవితా సంకలనం 'మార్చ్'ని నిషేధించి, ఇప్పుడు బెయిల్‌మీద విడుదలచేసినా కోర్టుచుట్టూ తిప్పుకొంటున్నారు, తమకే తెలియని నేరాలకు జ్వాలాముఖి. నిఖిలేశ్వర్, చెరబండరాజుగార్ల స్వేచ్ఛను అపహరించివేశారు. మాకార్యవర్గసభ్యుడూ, 'ప్రభంజనం' సంపాదకుడూ అయిన డాక్టర్ యం. వి. రమణారెడ్డి (ప్రొద్దుటూరు) గారిని హఠాత్తుగా పట్టుకొనివెళ్లి ఎక్కడెక్కడో తిప్పుతూ, ఆయన క్షేమం గురించి ఆందోళన కలిగే విధంగా, ప్రవర్తిస్తున్నారు. మునురుకొని పేరుకున్న చీకటిని కత్తుల్లాచీరిన మెరుపుల వంటి ఈ రచయితలు చీకటికోణంలో ఉండిపోవలసి వచ్చింది.

మా సంస్థ అవతరించగానే, పత్రికలు కాకిగోల సాగించాయి. కొందరు రచయితలు ముఖాలు చెండుకొన్నారు. విశ్వనాథ మా రచయితల గురించి పోలీస్‌శాఖా మంత్రికి హెచ్చరికలుచేశాడు. నోరి నరసింహశాస్త్రి మమ్మల్ని 'సాహిత్య నక్సలైట్లు'గా వర్ణించాడు. 'అభ్యుదయ' నామాన్ని కొత్తగా ముద్రించుకొన్న మహా మహాకవులు కొందరు పనిగట్టుకొని, కూడబలుక్కొన్నట్లుగా, మా ముఖాలకు మసిపూశారు. చివరకు సచిత్ర వారపత్రికల ప్రశ్నోత్తరాలలో కూడా మాసంస్థా స్వరూపం వక్రచిత్రంగా తప్ప చిత్రింపబడలేదు. ఇప్పుడు నిర్బంధంలో ఉన్న రచయితలు నిజంగా చేసిన నేరమేమిటి?

నేరుగా ప్రిజల్లోకి వెళ్లారు. పూలమాలలూ దుశ్శాలువలూ బిరుదులూ గండపెండేరాలూ అకాడెమి పదవులూ ప్రలోభపెట్టలేదు. స్వేచ్ఛాభానుడికి గ్రహణం పడుతూందని బాధపడ్డారు. పౌరహక్కుల సభలద్వారా, దిగజారిన గుండెలను యథా

స్థానానికి తెచ్చి నిలిపారు. చెదిరిపోయిన చేతులను కలిపి వజ్రికుడ్యం నిర్మింపబూనారు. భావాయుధాన్ని ప్రజలకు అందించారు. రచయిత మళ్ళీ ప్రజావాణి (tribune) అయేందుకు కష్టించి కృతార్థులయ్యారు. ఇది రాజకీయ నిమగ్నత అవుతుందా అని నా సందేహం. పోలీసులకుగానీ "థాట్ పోలీసులకు"గానీ నిమగ్నతకూ నిబద్ధతకూ తేడా తెలియదు.

పార్లమెంటులోనూ శాసనసభల్లోనూ పాలకపక్ష పభ్యుల ప్రతికూల విమర్శలకు గూడా గురైన కొత్తచట్టం అమల్లోకి వచ్చి రాకముందే, రచయితలనే నిర్బంధించ వలసి వచ్చిందంటే, ఏ పరిపాలననైనా ఏమనాలి?

ప్రజలు ఏమనుకుంటారోననే ఖాతరులేనప్పుడు ప్రభుత్వానికీ పశుత్వానికీ అట్టే తేడా ఉండదు. ప్రజాభిప్రాయాన్ని అవగణించే ప్రజాతంత్రిం నామమాత్రమే అవుతుంది. అప్పుడు దేశం ఆక్రోశాల కోశం అవుతుంది. పౌరులు వర్తి పాలితులుగా మాత్రమే లెక్కకువస్తారు ముసుగు నేలమీద పడిపోతుంది. ఫేసిజం ప్రత్యక్షమౌతుంది. ఈ దురంతం జరక్కుండా ఇప్పటినుంచీ ప్రతి మేధావీ, ప్రితి బుద్ధిజీవీ, చైతన్యంగల ప్రితి పౌరుడూ జాగ్రితపడాలి. ఇప్పటికే జరిగిన ఈ దారుణచర్యను ఉపసంహరించుకొని రచయితలను వెంటనే విడుదల చెయ్యాలని ప్రిభుత్వం మీద ఒత్తిడి తీసుకురావాలి. ఇది రాక్షసరాజ్యంగా మారిపోకుండా ప్రభుత్వం తనకు తానే నిగ్రహించుకోవాలి. రాజనీతిజ్ఞత్వమంటే దూరాలోచనతో గూడిన సంయమనమేగాని దురాగ్రహంతో కూడిన విశృంఖలత్వంగాదని అధికారులు గ్రహించేట్లు చెయ్యాలి.

పూర్తిగా ఎండి రాలిపోకముందే, స్వేచ్ఛాంకురాలకు దోహదం చేద్దాం, రండి। ఈ గ్రహణం నుంచి స్వేచ్ఛాసూర్యుణ్ణి బయటకు లాగేందుకు తోడ్పడండి।

ఈ అక్రమం ఇంకా సాగేందుకు వీల్లేదని చెబుదాం రండి।

విప్లవకవులపై ఆంధ్రప్రభుత్వం దాడి

# సాహిత్య హింసాకాండను విరమించాలి

పురాణం సుబ్రహ్మణ్య శర్మ

సిగ్గువిడిచిన ప్రభుత్వం విప్లవ కవులపై దాడి ప్రారంభించింది. కవులను హింసించిన ప్రభుత్వాలు కలకాలం మనినట్లు చరిత్రలో ఎక్కడా సాక్ష్యాలులేవు. కవులపై దాడిచేస్తే సాహిత్యంపై దాడిచేసినట్లే. సాహిత్యంపైదాడి భాషపై కూడా దాడి. రచనా స్వాతంత్రం అనే హక్కు యొక్క పవిత్రతను మంటగలుపుతూ కవులపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాగిస్తున్న ఈ అరెస్టులు దానికికలిగిన చిత్తచాంచల్యానికి పరాకాష్ఠ.

ప్రభుత్వం విప్లవకవులను గురించి ఎందుకు భయపడుతోంది? సాహిత్యం యిలావుండాలి. యిలా వుండకూడదు అని శాసించేహక్కు ఎవరికైనా వుందేమోకాని ప్రభుత్వాలకీ, పోలీసులకీ మాత్రంలేదు. ఇది ప్రభుత్వం పిరికితనానికి నిదర్శనం. దరిద్రులూ, నిరక్షరాస్యులూ కోట్లసంఖ్యలోవున్న మనదేశంలో చాలామందికి కష్టాలూ కన్నీళ్ళూ, బాధలూ రాసిపెట్టివున్నాయి. ఇరవైనాలుగేళ్ళ స్వాతంత్ర్యం ఈ దేశంలో దోపిడీ వ్యవస్థను బలపరిచిందేకాని సాంఘిక న్యాయాన్ని సమకూర్చలేకపోయింది. కంట్రాక్టరులు పెట్టుబడిదారులు, ప్రభుత్వాధికారులు బాగుపడ్డారే కాని సామాన్యప్రజల జీవితం కడగండ్ల పాలైంది. ఆర్థిక అసమానతలు రోజురోజుకి పెరుగుతున్నాయే కాని తగ్గేసూచనలు కనిపించటం లేదు. ప్రజాస్వామ్యం పేరిట ఈ దేశంలో జరుగుతున్న ఎన్నికలు ఒక ఫార్స్. ఓటు హక్కువలన పదవులను అలంకరించేవారి పేర్లు మారుతా యేమోకాని వ్యవస్థలో మౌలికమైన మార్పురాదు. ఈ ఎన్నికలు ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కలవారి వినోదంగా మారిపోవటం మనం కళ్ళారా చూస్తున్నాము. సాంస్కృతికంగా సాంఘికంగా రాజకీయంగా ఈ వ్యవస్థ కుళ్ళిపోయింది. జాతిని జడత్వం ఆవరించింది. ఈ దేశంలో కులవ్యవస్థ పాతుకుపోయి వికృతరూపంలో దర్శనమిస్తోంది. మూఢనమ్మకాలు మూఢవిశ్వాసాలు ప్రబలుతున్న సూచనలేకాని వాటిని తొలగించటానికి ఎవరూ ప్రయత్నించటంలేదు. ఈవ్యవస్థ మారాలని, ప్రజలు అజ్ఞానం నుంచి అంధకారం నుంచి బైటపడాలని విప్లవకవులు, విప్లవ రచయితలు

తీవ్రంగా కోరుతున్నారు. ప్రజలనుంచి పొందిన చైతన్యంతో కవులు ప్రజల తరఫున ఆలోచిస్తారు. అజ్ఞానంనుంచి అంధకారంనుంచి ఈజాతి బైటపడాలని అందుకు ఈజాతి ప్రజలు సాంస్కృతికరంగంలో పోరాడవలసి వుంటుందని తమతమ పరిస్థితుల్ని చక్క బర్చుకొనటం కోసం న్యాయమైన పోరాటాన్ని కొనసాగించవలసి వుంటుందని చెప్పి ప్రజలకు కనువిప్పు కలిగించవలసిన బాధ్యత కవులపై వుంది.

ప్రజలు మేలుకున్ననాడు, ప్రజలలో చైతన్యం వచ్చిననాడు తమకు జరిగే అన్యాయాలకు కారణాలు వారు తెలుసుకున్ననాడు ఈ దేశంలో ఏం జరుగుతుందో పాలకులకు బాగాతెలుసు. అందుకే వారు ప్రజలు ఆలోచించి నిజం తెలుసుకుంటారేమో నని పిరికితనంతో భయపడుతున్నారు. వారు మేల్కొంటే తాము నిర్మించుకున్న కోట గోడలు పునాదుల్తో సహా కూలిపోతాయని వారు భయపడిపోతున్నారు. ఈ భయంతోనే వారు పిచ్చెత్తినట్లు విప్లవకవులు రచయితలపై దాడి ప్రారంభించారు.

కవితా సంకలనాలను నిషేధించటం వలన కవులను నిర్బంధంలో వుంచి దొంగ కేసులు బనాయించటం వలన యిదంతా ఎందుకు జరుగుతోంది అని ప్రజలు ఆలోచించి సత్యంవైపు పురోగమిస్తారేకాని దోపిడీ వ్యవస్థను సమర్థించబోరని యితర దేశాల చరిత్ర నుంచైనా మన ప్రభుత్వం తెలుసుకోవలసి వుంటుంది.

అందుకే అది అకాడమీ బహుమతుల ద్వారా, జ్ఞానపీఠం ఎవార్డుల ద్వారా రచయితల సంఘాలద్వారా ఈ ధనికస్వామ్య వ్యవస్థను నిలబెట్టుకునేందుకు తనకు కావలసిన కవులను తనే తయారుచేసుకుని పోషించుకుంటోంది

వీరి వ్యవస్థనుంచి సన్మానాలు అవార్డులు, బహుమతులు, బిరుదులు పుచ్చుకున్న ఉద్దండులు కవిసమ్మాట్టుల ద్వారా సాహిత్యరంగంలో వీరు నిర్బంధంలో వుంచిన కవులభావాలను అభిప్రాయాలను ఎదుర్కొనవచ్చు కదా? మంత్రులు తామే సాహిత్య పోషకులమని విర్రవీగుతూ కుక్కలకు కుక్కబిస్కెట్లు పెట్టినట్లు కవులకు సన్మానాలు శాలువాలు బహుమతులు అనువాదాలకు అక్షరలక్షలు యిచ్చి వ్యవస్థను కట్టుదిట్టం చేసుకుంటున్నారు. ప్రజల గురించి ఆలోచించటం మానేసి కుక్క బిస్కట్లకోసం ఎగబడే కవులు ఎగబడవచ్చుకాని, అవినీతితో దుర్మార్గాలతో కులమత రాజకీయాలతో కుళ్ళిపోయిన ఈ వ్యవస్థను రక్షించుకుందుకని ప్రజాకవులను జైళ్ళలో నిర్బంధించవచ్చుగాక, ప్రజలు ఒకనాడు యీ వ్యవస్థ నిజస్వరూపాన్ని తెలుసుకున్ననాడు దాన్ని సమూలంగా నాశనం చేస్తారు.

శ్రీరాముడు రావణాసురుడి పదితలల్నూ నరుకుతూండగా అవి మళ్ళీ మొలవటం జరిగింది. ఈ వ్యవస్థను ఎంత ఖండించినా అది మళ్ళీ మొలుస్తూవుంటుంది చివరకు బొట్టమీద కొట్టగానే రావణాసురుడు డామ్మని మరణించినట్లు ఈవ్యవస్థ నాశనంగాక తప్పదు.

ఓటుహక్కు వినియోగించటం వలన మంత్రుల పేర్లు మారుతాయేమోకాని షూట్ చేస్తే వ్యవస్థే మారుతుంది అని జార్జి బెర్నార్డ్‌షా చెప్పాడు మేజర్ బార్బరా నాటకంలో. ఇంగ్లండే జార్జి బెర్నార్డ్‌షాను ఏమిచేయలేకపోయింది. దేశమంటే మనుషులోయ్ అన్నందుకు గురజాడమీద ఎవరూ చేయిచేసుకోలేదు. ఆంధ్రజాతి పునర్వికాస మహోద్యమానికి వైతాళికుడనదగిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ కుళ్ళిపోయిన వ్యవస్థమీద ఆయన చేసిన తిరుగుబాటు ప్రభుత్వం మర్చిపోయిందా? సంకుచితమైన రొమేంటిక్ పరిధిలో కొట్టుకుంటున్న తెలుగు కవితకు అంతర్జాతీయ దృక్పథాన్ని అలవర్చిన శ్రీశ్రీ, తెలుగు కథానికను ప్రజాయత్తం చేసి వచన రచనకు కొత్త మెరుగులు దిద్దిన రాచకొండవారినీ యింకా ఎందరో మహానుభావుల్ని కన్నందుకు గర్వపడే తెలుగుతల్లి, ప్రభుత్వం సాగిస్తున్న ఈ సాహిత్య హింసాకాండను చూస్తూ క్షమించి వూరుకోదు. కవులజోలికి పోవటం పాలిచ్చే తల్లి రొమ్ములపై చేయి చేసుకోవటమే అవుతుంది.

ఆనాడు హిట్లరు నుంచి ఈనాటి యాహ్యాఖాన్ వరకూ నియంతలంతా మేధావులపై రచయితలపై కవులపై జరిపిన దాడిని గర్హించిన మన ప్రభుత్వాలు ఈదేశంలో ఈనాడు చేస్తున్నదేమిటి? చరిత్రనుంచి సరైన గుణపాఠాలు గనుక మనం నేర్చుకోనక పోయినట్లయితే వారికి పట్టిన గతే మనకూ పడుతుంది. ఇప్పటికైనా పరిస్థితులు చేయి దాటకముందే ప్రభుత్వం మేల్కొని తమ తప్పులను సరిదిద్దుకోగ విజ్ఞతను ప్రదర్శిస్తుందని ఆశిస్తున్నాము.

సబుకో సన్మత్ దే భగవాన్!

(జయశ్రీ వారపత్రిక సౌజన్యంతో)

విప్లవకవుల అరెస్టు - కాళోజీతో ఇంటర్వ్యూ

# సర్వోదయమా? చారుమజుందార్ మార్గమా?

వరవరరావు

విప్లవ కవులైన జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజుల అరెస్టుపై ప్రజాకవి కాళోజీ రియాక్షన్ తెలుసుకుందామని కాళోజీ దగ్గరకు పోయాను. లోగా 'మార్చ్' పుస్తకాన్ని నిషేధించి కిషన్‌రావును అరెస్టు చేసినపుడు "పార్లమెంటరీ ప్రజాస్వామ్యం లోనూ, బూర్జువా కోర్టులలోనూ విశ్వాసంలేని విప్లవ రచయితలు ప్రభుత్వాన్ని అభ్యర్థించడమో, అర్జీలూ, మహజర్లూ పెట్టుకోవడమో అనవసరమేకాకుండా అసంబద్ధమైన చర్య" అనికూడా కాళోజీ విమర్శించి ఉన్నాడు. అయితే పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో వ్యక్తిస్వేచ్ఛ పరిపూర్ణంగా లభిస్తుందని ప్రగాఢంగా నమ్మి ఈ వ్యవస్థలోనే రచయితకు పరిపూర్ణ భావప్రకటనా స్వేచ్ఛ ఉంటుందని విశ్వసించే కాళోజీవంటివారైనా ఈ చర్యను ఖండించవచ్చుకదా అన్నది నా వాదన.

కొన్నాళ్లుగా కాళోజీ ఒకవిధమైన నిరాశా, నిస్పృహలతో ఏకాంత మౌనంలో నిల్చిపోయారు. ఒకప్పుడు కవి కలం బలంమీద, ప్రతిఘటనమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న కాళోజీ ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో ప్రత్యక్ష అనుభవం తర్వాత ఒక విధమైన నిర్లిప్తతకు లోనయ్యారు.

ఈ బ్యాక్‌గ్రౌండుతో కొంచెం సందిగ్ధంగానే కాళోజీ దగ్గరకు వెళ్ళి 'విప్లవకవుల అరెస్టుపై మీరేదయినా స్టేట్‌మెంటివ్వకూడదా?' అని అడిగాను.

"చెప్పానుగద బ్రదర్! ఏం స్టేట్‌మెంటివ్వమంటవ్ ఈ ప్రభుత్వం చేసిన ఏచర్య బాగుందని ఈచర్య బాగులేదనమంటావ్? ఇంకా విప్లవ కవిత్వాలు రాయాల్సిందే, రచనలు చేయాల్సిందే, గుండ్లదెబ్బలు తినాల్సిందే, జైళ్ళకు పోవాల్సిందే— తప్ప మరేమధ్యేమార్గమైనా రాజీయే ఔతుంది. జనసంఘం వాళ్ళు సత్యాగ్రహం చేస్తామంటే న్యూఢిల్లీలో నిషేధాజ్ఞలు పెట్టింది. తానుమాత్రం పదకొండువేల లారీలతో రాలీ తీస్తుందట. (ఈ ఇంటర్వ్యూ ఆగస్టు 7న చేసాను.) మంత్రులను సభ్యులు బయట విమర్శించగూడదని ప్రధాని చెపితే, అయితే మరిలోగా మొరార్జీని చంద్రశేఖర్ బయట విమర్శించాడుకదా! అప్పుడు మొరార్జీ మంత్రేకదా! అని ఓ సభ్యుడడిగితే

సమాధానం లేదు. ఇదీ మన ప్రభుత్వ అసంబద్ధత. ఊరూపేరూ కారణం లేకుండా విచ్చలవిడిగా అమాయకులను కాల్చిచంపిన దానికన్నా ఈ అరెస్టులు చాలా చిన్న విషయాలు."

అయితే ప్రజలకు ఈ విషయాలు చెప్పొచ్చుగదా! ఒక పౌరహక్కుల సభ జరిపితే ఎట్లా ఉంటుందని నేనడిగాను.

"అసలు మనకు పౌరహక్కులంటే యేమిటో తెలుసా? పౌరహక్కులను కాపాడుకునే జాగరూకత మనకున్నదా? హక్కులకొరకు పెద్ద పోరాటాల సంగతి అట్లా ఉంచండి. రెండు సంవత్సరాల క్రితం వరంగల్‌లో నీటికి కటకటపడ్డ రోజుల్లో రెండు మూడుమైళ్ళ దూరంపోయి నీళ్లుతెచ్చుకోవడానికైనా ఇబ్బందిపడ్డారుకానీ, ఒక్కరైనా ఈ సమస్య పరిష్కారం పురపాలక సంఘం బాధ్యత అని ఆందోళన చేశారా? అసలు మనకు ఎన్. జి. వోల సమస్యలూ, టీచర్ల సమస్యలూ, చప్రాసీల సమస్యలూ అని ఇట్లా వేరువేరుగా ఏకులానికాకులం సమస్యలేకాని, పౌరులుగా అందరికీ కొన్ని సమస్యలుంటాయనే జ్ఞానమేలేదాయె. అన్నిపనులవారూ సంఘటితమై తమహక్కుల కోసం పోరాడేరోజు వస్తుందా? అలాంటి సంఘటితశక్తీ చైతన్యమూ, ఉన్న బెంగాల్‌లో ఆ భావాలుగల వారినందరినీ ప్రభుత్వం లిక్విడేట్ చేస్తోంది. తూర్పు బెంగాల్‌లో యాహ్యాఖాన్ చేస్తున్నదానికి పశ్చిమ బెంగాల్‌లో ఇందిరాగాంధీ చేస్తున్నదేమీ తక్కువ లేదు అక్కడ హింసాత్మక చర్యలను అణచుట అనుమిషతో, మిలిట్రీచేస్తున్న హింసాకాండకు మితిలేదు. అయినా మన నాయకులు అన్నివిధాలా యాహ్యాఖాన్‌కన్నా రెండాకులెక్కువే చదివారు, రెండడుగులు ముందే ఉన్నారు. తెలంగాణాలో ప్రజలు నూటికి నూరుమందీ ప్రత్యేక తెలంగాణా కోరేవారికి ఓట్లు వేసినంతమాత్రాన తెలంగాణ ఇస్తామా? అట్లయితే వేర్పాటు ధోరణులున్న డి. యం. కె కు ఎనభైశాతం ఓట్లు వచ్చాయి. తమిళనాడు వేరైపోతానంటే ఊరుకుంటామా అని పోలికతెచ్చాడు మంత్రి వాసుదేవరావు. ఇది వ్రాసింది చాలక ఎన్నికల ముందన్ని పత్రికలకూ విడుదలచేస్తే ఈ బాధ్యతారహితమైన వ్యాఖ్యను వ్యక్తిత్వంలేని పత్రికలన్నీ అచ్చేసాయి. ఓట్లతో గెలిచిన ఒక మంత్రి ఓట్లమీద చేసినవ్యాఖ్య ఇది. ముజిబుర్‌రహమాన్ ప్రజలను బెదిరించి ఓట్లు వేయించుకున్నాడు. ఓట్లు వచ్చినంత మాత్రాన ముజిబ్‌కు అధికారమిస్తానా అని యాహ్యాఖాన్ అన్నదానికిదేం తీసిపోతుంది.

"ప్రజలకోసం ప్రకటన ఇచ్చినా వేసే పత్రికలు మాత్రమేమున్నాయి" అని అంటూ ఒక ప్రకటన వ్రాసి దానిచివర ఇట్లారాశాడు. "ఈ ప్రభుత్వాన్ని మళ్ళీ ఒకసారి హెచ్చరిస్తున్నాను.

"ఓట్ల తిన్ననిబాట కడురాకండి
షాట్లతో మిముదింప పురి కొల్పకండి".

ఈ రెండు చరణాలు చదివితే ఇటీవల మిత్రమండలి సమావేశాల్లోనూ, బయట ఎప్పుడైనా జరిగే చర్చల్లోనూ కాళోజి అంటున్నమాట గుర్తుకొచ్చి, ఆయన ఈ ప్రభుత్వ దమననీతితో విసిగిపోయి 'క్రాస్‌రోడ్స్'లో తోచకుండా చిక్కుకున్నా డనిపిస్తున్నది. "ఈ దేశానికింక ఒకే ఒకమార్గం, అది సర్వోదయమో చారూమజుందార్‌మార్గమో" బహుశా ఈ రెండింట్లో తమకు సరియైనమార్గమేదో కాళోజీకన్నా ఈనాటి యువకులు స్పష్టంగా నిర్ణయించుకోవాల్సిన అవసరమున్నది.

ఇంటర్వ్యూపై కాళోజీ వ్యూ :

ఇదంతా రాసి ప్రచురణకు యిచ్చేముందు కాళోజీకి ఒకసారి చూపుదామని వెళ్ళి చూపించాను 'నేను చెప్పినట్లుగా రాసినమాటలు నేను చెప్పినవే. వాటిపై అభిప్రాయాలు వ్యాఖ్యలు నీవి. దానికి నేననేదేముంది. నీయిష్టం' అంటూవుంటే ఆయన కళ్లల్లో నీళ్ళు తిరిగాయి ఆవేశంతో ఊగిపోయాడు. (Man of civil liberties!) కాసేపాగి "క్రాస్‌రోడ్స్‌కూడ కాదు. తేల్చుకున్నాను. వాయ్‌లెన్స్ ఒక్కటే మార్గం. కాని, వాయ్‌లెన్స్ మస్ట్ బి సుపీరియర్" అన్నాడు. 'అంటే' ఏమిటన్నాను.

'ప్రభుత్వందగ్గర అధికారం, అయుధాలు వున్నాయి. వాటిని ఎదిరించడానికి ఆయుధాలు, ప్రజాబలంకావాలి. ఆయుధాలు ఎక్కడినుండివస్తాయి. విదేశాలు యివ్వాలి. పోతే ఒక్కడు సత్యాగ్రహంచేసినా వాడు సత్యాగ్రహం చేసాడని ఒప్పుకొని జైల్లోపెడుతారు. కాని నూరుమంది ఆయుధాలు పట్టినా వాళ్ళను హంతకులని చిత్రించి జైళ్లోపెడుతారు తప్ప మరోలా అనరు. పోతే యీ వ్యవస్థలో ప్రజలు కలిసివస్తారా అన్నది నాకు నమ్మకం లేదు. పండ్లదుకాణం వాడు మొదలుకొని, పైవాడిదాకా అందరికీ ఏవో చిక్కుముళ్లు. పంచాయతీరాజ్‌లో ప్రతివాడూ అధికారంలోవున్న వాడి మోహమాటంలో పడిపోయాడు. ప్రభుత్వం కొండలాగున్నది. కొండకు కొట్టకుంటే తలకేదెబ్బ తగుల్తుంది, అయితే కొండ కొంచెం కొంచెం అరుగుతుందనికూడ ఒప్పుకుంటాను' అని వివరించాడు.

కవితా ఖండనలు :

# పుచ్చిపోయిన ప్రభుత్వం పిచ్చిచేష్టలు

నగ్నముని

ఈ తుపాకులెందుకు ఈ మిలిటరీకార్లూ హారన్లూ పోలీసులెందుకు
ఈ ఇళ్ళ సోదాలెందుకు ఈ నిఘాలెందుకు ఈ అరెస్టులెందుకు
ఈ కటకటాలూ చట్టాలూ ఎందుకు ఈ కోర్టుల పరాచికాలెందుకు
ఈ ఉపన్యాసవిన్యాసాలూ ఈ వాగ్దానాలెందుకు ఈ శంకుస్థాపనలెందుకు
ఈ ఎలక్షన్ల నాటకం ఎందుకు ఈ బడ్జెట్లూ ప్రణాళికల వ్రణాలెందుకు
ఈ చదువులూ చట్టుబండలెందుకు ఈ బిచ్చగాళ్ళ ఉత్పత్తి ఎందుకు
ఓ మహామాంత్రికులారా
ఓ క్షుద్ర దేవతలారా జెలగల్లారా
నాయకులారా కాపిటలిస్టుల్లారా
కొత్తకొత్త రోగాలకి కొత్తకొత్త మందులు తయారు జెయ్యడానికీ
కొత్తకొత్త రోగాల్ని ప్రజలరక్తంలో కలపడానికీ
ఆటంబాంబులకీ గ్రహాంతరయానాలకీ
సైంటిస్టుల్నెందుకు వినియోగిస్తారు
'ఈ తారతమ్యాలెందుకు
ఈ దేవుడూ దెయ్యం ఎందుకు
ఈ వ్యవస్థని సమూలంగా మారుస్తాం'
అని అమాయికంగా రానున్నకాలంలో
అడగబోయే అర్భకుల్ని
తల్లి గర్భంలో వుండగానే కనుక్కొని
అక్కడికక్కడే వాళ్ళని హతమార్చేసే శాస్త్రపరికరాల్ని కనుక్కోమని
సైంటిస్టుల్ని ఆదేశించండి
ప్రశ్నించే మనుషులు ఇప్పుడెలాగూ చస్తున్నారు
ఇంకా ఇలా ప్రశ్నించే మనుషులు
ఈ భూమిపై కాలుపెట్టనివ్వకుండానే నివారించండి
అప్పుడు తిరగబడడాలూ విప్లవాలూ వుండవు
ఇంక నిర్భయంగా
ప్రశ్నించనివాళ్ళతో ఈ లోకాన్ని మీరేలుకోవచ్చు.

# అరెస్ట్

జ్యోతి

ఖంగారెత్తిన
పితూరీ గుండెల్లో గ్రనేడ్ల శబ్దం అరెస్ట్
ధనం మూతిబిగింపులో
కరకరమంటున్న నగ్నసత్యం అరెస్ట్
పహారాకాస్తున్న
పోలీసు జవాను
తుపాకి గొట్టంలోదూరి రోదిస్తున్న గుండ్లరెస్ట్
కంకరరాళ్ళమీద కసాయి బూట్లు
చింకిచాపమీద చీకటికళ్లు
చేస్తున్న శబ్దం అరెస్ట్
నీ ఉచ్ఛ్వాసనిశ్వాసాలరెస్ట్
వడ్డీల లావాదేవిలో
ఎదుటివాడి రక్తాన్ని పీలుస్తూ లేస్తున్న ప్రాంసరినోటరెస్ట్
వడ్డీవ్యాపారి అరెస్ట్
సినిమా ప్రొడ్యూసర్ అరెస్ట్
ప్రొడ్యూసర్ల బూట్లునాకే బికారి అరెస్ట్
కోటీశ్వరుడు అరెస్ట్
గుడ్డివాడు అరెస్ట్
ధనస్వామ్య అంగాంగం అరెస్ట్
ప్రజాస్వామ్య గొడ్రాలి సంస్కృతి అరెస్ట్
నువ్వెవ్వడివోయ్
అరెస్ట్‌చెయ్యడానికి - విప్లవాన్ని
జ్వాలాకిరణాన్ని;
నువ్వెవ్వడివోయ్
జోకొట్టడానికి - సత్యాన్ని
మోస్తున్న చెరబండ సాహిత్యాన్ని;

నువ్వెవ్వడివోయ్
చాపకింద కప్పడానికి-
మేల్కొన్న సమాజాన్ని
నిఖిలలోక నిర్భీతి నీరవ తేజోవలయాన్ని
విప్లవ సమతాజ్యోతిని.

## ఈ వ్యవస్థే ఒక జైలు

ఎస్. కె.

నిర్బంధంలోవున్న నీకూ, నాకూ తేడాలేదు
ఈ వ్యవస్థే ఒక జైలు
కటకటాలను విరగదన్నుకునిరా
ప్రజాశక్తి పాదాలతో
యీ వ్యవస్థ శిరస్సుమీద బలంగా అడుగెయ్

ఏనాడు యీకోర్టు
సత్యాన్ని చెప్పినవని
యీనాడు వాట్ని పలకమనాలి
సమతా సత్యాన్ని కాల్చనిదే
ఏనాడు తుపాకీలు ఆగినవని
నిన్నూ నన్నూ విడువడానికి

ఎక్కడగాలి
ఊపిరి బిగపట్టుకుని వింటున్నదో
ఎక్కడ వెలుతురు
కళ్ళు చిట్లించుకుని చూస్తున్నదో
అక్కడ స్వేచ్ఛ నిర్ణయాన్నిచేస్తున్నది
పీడిత ప్రజాహృదయాల్లో
శ్వాస విప్లవాన్ని పీస్తున్నది
సంకెళ్ళదాస్యాన్ని చీల్చాలనిరా—

# జైల్లో స్వేచ్ఛ

కె. శివారెడ్డి

స్వేచ్ఛ రక్తం
స్వేచ్ఛ గాలి
స్వేచ్ఛ ఎండ
స్వేచ్ఛ కవిత్వం
అజేయంగా అనన్యంగా వెలిగే
సూర్యుడు స్వేచ్ఛకు మారుపేరు'
కవిగారు పొరబడ్డాడా
ప్రభుత్వం గుండెలు తడబడ్డాయా—?
స్వేచ్ఛకే స్వేచ్ఛలేని పరిస్థితి.

పదాల్లోనూ – పుస్తకాల్లోనూ
ప్రసంగాల్లోనూ – పెదాలమీద
స్వేచ్ఛ స్వేచ్ఛగా నర్తిస్తుంది,
నిఘంటువుల మ్యూజియాల్లో
స్వేచ్ఛావశేషాలు పదిలపరచబడ్డాయి.

ఓ పారడాక్సికల్ డెమొక్రసీ!
నిజం! నువ్వు ఎఫిజీవి!
ఐ మాక్ ఎట్ యు
ఐ లాఫ్ ఏట్ యు.

మనుషులంటే
రోడ్డుపక్క దొర్లించబడ్డ
ఖాళీ తారుడబ్బాలని వ్యాఖ్యానించు—
అందుకే
మనుషులకి అర్థం చెప్పే
వాళ్ళంటే నీకు గిట్టదు.

మనుషులకు ప్రాణం
పోసేవాళ్ళు నీకు శత్రువులు.
స్వేచ్ఛా వాంఛలోని అగ్ని
స్వేచ్ఛా వాంఛలోని ఆకలి నీకు సరిపడదు.

స్వేచ్ఛా వాంఛ నరనరాన నిండి
ఉచ్ఛ్వాసనిశ్వాసాల్లో ప్రవహిస్తుంది.
అనిలంకన్నా అనలంకన్నా
ఉద్విగ్నమైంది స్వేచ్ఛ,

జైళ్ళు తుపాకులు కబోదులు
ఉడుకురక్తపు టుద్యమాన్ని అరికట్టలేవు-
వాడు కాకుంటే
మరొకడు ఆ టార్చినందుకుంటాడు
ఇది చరిత్ర గర్భంలో
ఆణిముత్యపు సత్యం.
జనపదాల మేల్కొలిపే యత్నంలో
ప్రతిపేద రక్తపు బొట్టూ
భాస్కరుని వారసత్వం పొందింది.

**సాహిత్య సంచలనం:**

మళ్ళీ నలుగురు రచయితలను ప్రభుత్వం అనబడేది అరెస్టు చేసింది.
ప్రజలలో వీళ్ళుండడం దేశభద్రతకు భంగకరంగా వున్నదట,
అందుకే వాళ్ళను జైళ్ళలోకి తోసింది.

"స్వాతంత్ర్యం రోడ్డుమీద తమాషా జంతువై తరుమబడి / ప్రజాస్వామ్యం దొంగలపార్కులో దుర్భరంగా కసరబడి / పార్లమెంటు చర్చల్లో హక్కుల విచిత్ర పదార్థంగా ప్రదర్శింపబడి / ఖరీదైన కోర్టుభాషల్లో చెల్లనినాణెమై విసరబడి / ఎన్నికల తిరునాళ్ళలో / ఎంగిలి విస్తరాకులకై / బలవంతాన తోయబడి"—

"వానల్లో స్నానమాడి వడగాడ్పుల్లో ఆరి / ఆకల్ని ఆరగించి కన్నీళ్ళను సేవించి / చలిని కప్పుకొని / ఆశల ఆకులురాలిన చెట్లక్రింద / ఎక్కిళ్ల జోలపాటలో / కలతల కునుకుల చేతితలగడపై / అలలు అలలుగా కలలుగంటున్న"వారికోసం కలంపట్టి

"మాతృదేశం మంచితనం సంగీతం గూర్చి / మాట్లాడే హక్కు నీకులేదు / రక్తం తాగుతూ అమృతమనుకుంటున్నావ్ / నిన్నూ నీ బలగాన్ని గద్దెదింపనిదే నిద్ర లేదు / ..................... / నిన్ను పిచ్చికుక్కలా / తరిమి తరిమి కొట్టేతరం జూలు దులిపి దారికాచి వేచివుంద"న్న వారిని—

"సామాన్యుడి తలపాగాను చించి / రోజుకో జండాని ఎగరేసే గుండాల / చెవులు పట్టి వెనక్కి తిప్పి / ప్రగతిపేర రేపిన ప్రణాల్ని / మూత్రశాలలుగా చాకిరేవులుగా మారిన / శంకుస్థాపన స్థావరాల్ని / కళ్లబొరలు పెరికి చూపిస్తాన"న్న వారిని—

"యాచకీయాల వారసత్వాన్ని మోస్తున్న / వెన్నెముక వంగిన నూతన తరాల-నరాలకు- ఆలోచనలకు తీరిక ఇవ్వని సెక్సు సాహిత్యం- లంగామార్కు సినీమాల"ను బహిరంగంగా ప్రోత్సహిస్తూ దోపిడీ వ్యవస్థను కాపాడ కత్తులు పట్టుకు నిలబడ్డవారు అరెస్టుచేసారు.

అహింసను ప్రబోధిస్తూ, లా ఎండ్ ఆర్డర్ పేరిట సాయుధులై లక్షలాదిన హత్యచేస్తూ— నిరాయుధులైన ప్రజల పక్షంచేరి కలం పట్టినవాణ్ని సాయుధుడని ఆరోపించి హింసిస్తున్న— ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని గూర్చి—

ఇరవైనాలుగవ సంవత్సరీకంలో పడిన స్వాతంత్ర్యాన్ని ఘనంగా జరుపుకుంటున్న రోజున—

ఆలోచించేందుకు 'మిత్రమండలి' ఈ సమావేశం ఏర్పరచింది. ప్రభుత్వం, తలలు ఖండిస్తుంటే— ఆ చర్యలను ఖండించేవాళ్ళూ, ప్రభుత్వాన్నే ఖండించాలనే వాళ్ళూ, అందరూ ఇందులో పాల్గొంటున్నారు.

గజ్జల దక్షిణామూర్తి
కన్వీనర్
మిత్రమండలి, వరంగల్.

విషయం ఏమిటంటే

జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు– వీరిని ప్రభుత్వం– మనది కాదు, వారిది– ఆ ప్రభుత్వం అరెస్టు చేసింది.

అదీ విషయం.

అందుకు నిరసనగా మనసభ.

నిఖిల్, రాజు, జ్వాల– వీరు దొంగలా ? కారు. బందిపోటు దొంగలా? కారు. వీరు దొంగలాభాలు తీసేవాళ్లుకారు. ఆతతాయిలు కానేకారు. హంతకులసలేకారు.

అయితే—

వీరిని అరెస్టు చేసింది వారి ప్రభుత్వం.

ఆ ప్రభుత్వం వీరిని– ఎందుకు అరెస్టుచేసింది. అని ప్రశ్నిస్తే దేవకీవసుదేవులు జెయిలుకి వెళ్ళినట్టే వీరుకూడా వెళ్ళారని మనం సమాధానం చెప్పవలసి ఉంటుంది. వీరు సృష్టించబోయేతరం, వారిని హతమార్చవచ్చు. అదీ అసలు భయం. అదివాలా పెద్దభయం.

దేశంలో దొంగలాభాల వాళ్ల దొడ్డకారుల్లో గొప్పగా ఊరేగుతున్నారు. దొంగ సన్యాసులు దొరలై తిష్టవేసి కూర్చున్నారు; బీదల రక్తం తాగేవాళ్ళు భీభత్సంగా పరిపాలన సాగిస్తున్నారు. ఇటువంటి వీరంతా రాజునీ, జ్వాలనీ, ఈశ్వరుణ్ణీ ద్రోహు లంటున్నారు.

ఈ ముగ్గురు వాళ్ళ ఎడల ద్రోహులేకావచ్చు

కాని,

ద్రోహుల్లోకూడా మహాత్ములుంటారు.

కీచకుడి ఎడల భీమసేనుడు ద్రోహి. రావణబ్రహ్మ ఎడల రామరాజు చెడ్డ ద్రోహి. బ్రిటిషువాడి రాజ్యంలో గాంధీ అనేవాడు గొప్ప ద్రోహి.

రాక్షసులు రాజులయితే ఋషులంతా ద్రోహులే. వాళ్లవెళ్ళేవి జెయిళ్ళే. అక్కడ వారికన్నీ చిత్రహింసలే.

అందుచేత నిఖిల్, జ్వాల, రాజుల్ని అరెస్టు చెయ్యడం గురించి ఈ సభలో మాట్లాడేవారంతా నిరసనగా తప్ప మరోలా మాట్లాడరు.

ధైర్యం ఉంటే ఈ మీటింగుకి రండి, లేకపోతే పోలీసు జేబుల్లోకి పొండి.

పౌరరక్షణ సమితి

విశాఖపట్నం.

నిజాలు పలుకుతున్న నోళ్ళుమూయించే ప్రభుత్వ దమననీతిని ఖండించండి.

హైదరాబాదులో విప్లవకవుల ఇళ్ళపై పోలీసులదాడి శ్రీయుతులు జ్వాలాముఖి చెరబండరాజు, నిఖిలేశ్వర్‌ల అరెస్టు, "సోషలిజం" ముసుగు తగిలించుకున్న ప్రభుత్వ ప్రజాస్వామ్య వ్యతిరేకచర్యలు.

దిగంబర కవితోద్యమరూపంలో అన్యాయాలను, అవినీతిని, దోపిడీని తీవ్రంగ నిర్ద్వంద్వంగా నిరసిస్తు అగ్రహ భార్గవులుగా, ఈ అవ్యవస్థావిషవృక్ష నిర్మూలన గండ్ర గొడ్డళ్ళుగా ఆధునికాంధ్ర సాహిత్యరంగాన పేరుకుపోయిన స్తబ్దతనుఛీలుస్తూ చారిత్రిక ప్రాధాన్యత నిర్వహించి, మార్క్సిస్టు దర్శనానికి కట్టుబడి విప్లవకవులు, విప్లవరచయితల సంఘకార్యవర్గ సభ్యులు అయిన శ్రీయుతులు జ్వాలాముఖి, చెరబండరాజు, నిఖిలేశ్వర్‌గార్ల ఇళ్ళపై ఆకస్మికంగా దాడిచేసి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆగస్టు 2వ తేదీ హైదరాబాద్‌లో వారిని అక్రమంగా నిర్బంధించింది.

ఒకప్రక్క ప్రజాస్వామ్యం, సెక్యులరిజం, సోషలిజం అని డప్పావాయించు కొంటూ ప్రజల్ని చట్టబద్ధంగా వంచిస్తూన్న ఈ ప్రభుత్వం మరొకవంక భావప్రకటనా స్వేచ్ఛను రచయితల రచనా స్వాతంత్ర్యాన్ని అరికట్టుతోంది. అందుకు బలమైన నిదర్శనం విప్లవ సాహిత్యాన్ని నిషేదించి విప్లవ కవులను నిర్బంధించడం. విప్లవ కవులు రచయితలు ప్రజా ఉద్యమాలతో స్పందించి ప్రజాపోరాటాలకు అక్షర రూప మిచ్చే సాహిత్యస్రష్టలు మాత్రమే తప్ప ఏ రాజకీయపక్షాన్నీ గుడ్డిగా అనుసరించే వారు కాదు. ఈ ప్రభుత్వం పుస్తకాలను నిషేధించి రచయితలను నిర్బంధించగలదేమో గాని, ప్రజల గుండెల్లో ప్రతిధ్వనించే విప్లవ సాహిత్యాన్ని ప్రజల గుండెలను నిషేధించలేదు. ప్రజలారా! విద్యార్థులారా! మండుగుండెల యువకుల్లారా!

పీడితప్రజల పక్షననిలిచి తమ కలాలే కత్తులుగా కాంతులుగా శ్రమజీవుల కష్టాలను కన్నీళ్ళను వర్ణిస్తు భావవిప్లవంకోసం సాహిత్యసృష్టి చేస్తూన్న ప్రజాకవులు చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లకు జరిగిన అన్యాయాన్ని తీవ్రంగా ఖండించండి.

మేధావులారా! రచయితలారా! రచయితల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను పరి రక్షించుకొనండి. నేటిదోపిడీ సామాజికవ్యవస్థను కూల్చి సమసమాజ స్థాపనకోసం సామ్యవాద నిర్మాణం కోసం నడుంకట్టమని ప్రజలనుద్బోధించడం తప్ప ఏనేరమూ ఎరుగని, ప్రజా విప్లవకవులను వెంటనే విడుదల చెయ్యమని డిమాండ్ చెయ్యండి.

విప్లవ కవులపై ప్రభుత్వ అమానుష నిర్బంధచర్యను ఎలుగెత్తి నిరసించండి.

ఇట్లు
విప్లవ సాహితి
అనంతపురం జిల్లా.

# ఎట్లా చెప్పాలి మీకు?

వే. నరసింహారెడ్డి

ఇంచుమించు
ఇరవై ఐదేళ్ళనించీ చూస్తున్నాను.
ఠంచన్‌గా రోజూ బైముకివస్తాడు
పాడుతూ మాయింటికి పాత బిచ్చగాడు

ఏటేటా వచ్చే స్వాతంత్ర్య దివసం
ఎంచక్కా ముస్తాబై వస్తుంది.
ఏమీతోచని నేను
ఏదో ఆలోచిస్తూ ఉంటాను.

చావుమీదా, బతుకుమీదా
పరిశోధన చేస్తున్న నాకు
ప్రాణం అంటే ఏమిటో తెలిసిందికాని
ఎట్లా నిర్వచించాలో తెలియడంలేదు.

ప్రాణం స్వాతంత్ర్యంవంటిదన్నానేకాని
స్వాతంత్ర్యాన్నికూడా నిర్వచింపలేక పోతున్నాను.
ఒకోసారి
చావే బతుకనీ
బతుకే చావనీ
ఇప్పుడు మనం
బతుకుతున్నది బతుకు కాదనీ
ఈ స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం కాదనీ
ఎట్లా చెప్పాలి మీకు?

SRJANA Telugu Monthly September '71 Regd. No. H-1088

# సృజన

మనిషికి మనిషేగా తోడునీడాఅంటే
పోరాటం మినహా బతుకూ భవిష్యత్తూ అసలేలేదంటే
కంఠాలనిండా ఇనుపముళ్ళు కుక్కేచట్టం...

—చెరబండరాజు.

ప్రజాస్వామ్యం ముసుగులో రోజూ
ప్రభుత్వం ఆదేశాల అక్షరాలలో
పోలీసుల తలల్లో- చేతుల్లో
ప్రేలుతున్న హింస
ప్రజలను నిలువునా మింగినపుడు
చెలరేగుతుంది యువకరక్తం
ప్రతిహింసతో ప్రతిఘటిస్తూ...

—నిఖిలేశ్వర్.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.) Re. 1